శ్రీ కృష్ణ పరమే గురుభ్యో నమః.

శ్రీ వెలుగోటి

# సర్వజ్ఞకుమారయాచేంద్ర భూపాల

విరచితంబైన

# మనస్సాక్ష్యము.

అనుతత్త్వగ్రంథము.

చెన్నపురి, తండ్యార్ పేట
తిరువట్టూర్ హైరోడ్డులోనుండు
శారదాంబా విలాస ముద్రాక్షరశాలయందు
నాల్గవ పర్యాయము
ముద్రింపబడియె.

౧౮౯[illegible] సం॥

జూలై నెల.

MADRAS

మనస్సాత్త్వమను

తత్త్వగ్రంథము నందలి విషయ సూచిక.


దైవం
సత్యం





శ్రీకృష్ణ పరమ గురుభ్యోనమః.

మనస్సాక్ష్యము-అను గ్రంథము.

---

భూమిక.

నేననేక దేశములు తిరిగి యనేక మతముల రహస్యము లడిగిసి కొనియు ననేక మతస్వరూపములం దెలుపు శంకరవిజయాదిగ్రంథము లను దబిస్తానే మజాహెబులను ఫార్సీ గ్రంథమునుజూచియు వినియు ననేకులతో వాదించియు వైదికమతంబులనంబడు త్రిమతంబులపండితుల వల్లనద్విషయములు చక్కగా బోధపరచుకొనియు వేదాంతగ్రంథము లనేకము జూచియు ననేకసంవత్సరములు దీర్ఘాలోచన జేసియు శ్రుతి స్మృత్యాది స్వరససిద్ధములైయు యుక్తిసహములైన తత్త్వాంశములు భగ వత్ప్రేరణవల్ల నాబుద్ధికిగోచరించినవి యుదహరించి శ్రీవెలుగోటిబం గారు యాచేంద్ర భూపాల కుమారుండను సర్వజ్ఞ కుమారయాచేంద్రాభిధానుండ నగు నేను మొదల శ్రీ గీతార్థ సారసంగ్రహం బను గ్రంథమురచించినాడను.

అయితే అనేకభాషలతో వారివారి వేదములుండగా సంస్కృతభాషతోనుండు శ్రుతిస్మృత్యాదులలో స్వరససిద్ధములైనయంశములు మొదల గ్రంథముగానేల వ్రాసితివంటే సంస్కృతభాష బహుభాషలకు మాతృభాషగానున్నందున వ్రాసితిని ఎట్లన్నగా. ఈభాషలో తప్పుచుగా నామంబులకు ప్రకృతిప్రత్యయముల వలన సార్థకనిర్ణయము కలిగియున్నది ఇందువలన సమస్తభాషలు సంస్కృతభాషలోనుండు నానాపదార్థములను ఉపపర్యాయనామములలోనొక్కొక్క నామములో నుండి తద్భవతత్సమములుగాను నితరభాషలల్లో ఆపదార్థములకే నామములు పుట్టియున్నవి.

ఈప్రకారముగా నితరభాష పర్యాయ నామములలో నుండి సంస్కృత భాషగాని తదితరసమస్త భాషలుగాని పుట్టియుండలేదు ఇందుకు క్రిదే నిదర్శనము.

అయితేఅర్వబ్భిభాషమాత్రము సంస్కృత. పర్యాయ నామము లవలన తద్భవములుగా కొన్నివస్తువులనామములు పుట్టినవేగాని ప్రాయశః ధేశ్యనామములుగనున్నవి ఇంతేగాక సంస్కృతభాషకు దేశము లేదు అక్షరములు లేవు అయితే కొందరు నాగరను అక్షరములలో బాలబోధఅక్షరములను, మహారాష్ట్రములో చాలబందుఅక్షరములను, ద్రావిడములో గ్రంథాక్షరములను, సంస్కృతభాషయొక్క అక్షరము లని వారువారు చెప్పుచున్నారుగాని అట్లుగావు ఇంగ్లీషులో, వ్రాసే అక్షరములకున్ను గ్రంథములుఅచ్చువేసేఅక్షరములకున్ను ఎట్లు భేదము గానున్నవో ఆలాగే యెగువ వ్రాసినభాషలలో గ్రంథములువ్రాయుటకు ఏర్పరచుకొన్న అక్షరములేగాని సంస్కృతభాషకు సంబంధించి న అక్షరములుగావు.

ఇట్టిహేతువులచేత సమస్తభాషలకు మాతృభాషగా నున్నది గానసంస్కృతభాషలోనుండు వేదాదులందుగలభాగములు స్వరసిద్ధములుగానుండునవి. మొదలవ్రాసితిని. వేదబాహ్యులు దానినొప్పుకొనరుగనుక ప్రత్యక్షానుమాన ప్రమాణయుక్తిసహాముగాసారాంశపంచకంబను ననుగ్రంథమును రచించినాడను.

ఇంకననేకనేశ్వరమతస్థులవేదశాస్త్రములలోనునుండు భాగములు నామనస్సాక్షితో యోచించి యుక్తమైనవి గ్రహించి "దైవము సత్యముగానున్నాడని" నిశ్చయించి యట్టి జగత్కర్తయైనసర్వేశ్వరుని నుపాసించురీతి జగన్నాథుడు నాబుద్ధికి గోచరింపజేసిన చరమాభిప్రాయమును తెలిపెడు నిమ్మనస్సాక్ష్యము అనునీగ్రంథమును వ్రాయుచున్నాడను.

ఇంధుకు మూడంశములుముందుగా వివరించవలసిన యావశ్యకముగానున్నది అవిమెవ్వియనిన.

౧, ఈగ్రంథము వ్రాయుటకు గారణంబును

౨, ఇట్లెవ్వరువ్రాయనిది వ్రాయుటయందు నాయొక్క సాహసంబును

౩, ఇందునగురించిలోకపరూపణంబును

ననునీవిమూడు.

—(*) ఈగ్రంథము వ్రాయుటకు గారణము. (*)—

ఏమనగా: ననేకమతస్థులయొక్క వారివారి వేదశాస్త్రములలో నుండుభాగములు రెండు.

౧, ధర్మములను దెల్పు కర్మకాండము.

౨, తత్వములను చెల్పుజ్ఞాన కాండము.

మొదటిది దేశకాల కులాగతములుగా దేహారోగ్య శారీశుద్ధ్యాదులకును అసహ్యానివృత్తికిని నితరులజీవనోపాయమునకును అప్పటప్పటివిద్యమానములను బట్టి బుద్ధిమంతులచే నేర్పరచ బడిన ధర్మములు గలది కర్మకాండము.

అయితే ఆప్రకారము ఆచరించుటకొరకు అర్థవాదములుగా అపూర్వముగలుగునట్లుశాస్త్రములలో వ్రాసియున్నారు అవిసరికాదు ఇందుకు నిదర్శనము కొన్నిటికి అకరణేప్రత్యవాయమునని చెప్పియుండు నదిసరియగునా. యెందువల్లనంటే అభావమువలన భావోత్పత్తిగలుగునా. "అభావాత్ భావోత్పత్తి గలుగదు" అని శంకరాచార్యులవారు తైత్తిరీయోపనిషద్భాష్యములో వ్రాసియున్నారు. యోచించుడు. గాననందులోవిశేషములుగా వ్రాయవలసినది అంతగా ఆవశ్యకమని తోచలేదు.

అయినప్పటికిన్ని కొంచెము వ్రాయ వలసియున్నది. ఏమనగా: అనాదులిచ్చేట్లకు నందర్భపాత్రులే యని యనేకమతస్థులశాస్త్రము

లలో ప్రవాసియున్నారు పురాణులుమాత్రము దాని నొప్పరు ఏలనంటే అవయవములో పాదులవలననేవిధమైనవృత్తిచేసుకొనిజీవింపజాలక యు వాలనుపోషకులులేకయు నుండు నశక్తులకుమాత్రముఅన్నాదులిచ్చు టయీశ్వరప్రీతియగునుగాని సోమరితనముచేతగష్టముచేయజాలక నా నావిధవేషములువేసుకొనియాచించువారికన్నాదులిచ్చుట యీశ్వరప్రీ తిగాదు ఏలననగా వారివారికి దేవుడిచ్చినశక్తిచేతకష్టపడిసంపాదించి జీవించుటవలన వారికిమదముతగ్గియెదటివారికష్టమునుతెలిసి మంచిగా ప్రవర్తించుదురు అట్లులేక ఆరోగదృఢగాత్రులుగానుండి యాచించు వారికిఅన్నాదులిచ్చినయెడలవారేకష్టముచేయకున్నందునమదము హె చ్చి దుర్విషయంబుల బ్రవేశించి లోకులను శ్రమపెట్టుటకు హేతువగు చున్నదిఅనిచెప్పెదరుఇందుకు అధర్వణవేదము గోపథబ్రాహ్మణములో గుడ్డివారికి కుంటివారు మొదలగు నసమర్థులకు, నన్నముఇవ్వవలెనని చెప్పబడియున్నది ఇందువల్ల మంచివారికిచ్చిన యెడలభగవత్ప్రీతికలు గునుగనుక ఇది సరిగానున్నది మరియును॥ శ్లో॥ పాత్రాపాత్రవిశేషో స్తి ధేనుపన్నగయోరివ । తృణాత్సంజాయతేక్షీరంక్షీరాత్సంజాయ తేవిషం॥ అనియున్నది గోవునకు అల్పమైనతృణము నిచ్చుటవలన క్షీర మును గలుగజేయుచున్నది పామునకుపాలుపోసినను విషమును గలుగ జేయుచున్నది యిందువల్ల అన్నాదులిచ్చుటకు అందరు పాత్రులుగారు ఇక పాత్రులెవరనియంటే: విరక్తులు, ఆశ్రితులు, ఇతరవృత్తితో జీవింప జాలనియశక్తులయ్యునుపోషకులులేనివారు. వీరికిఅన్నాదులిచ్చుట యీ శ్వరప్రీతికరమగునని యుక్తికి వచ్చుచున్నది. సరే అయితే ఆశ్రితులకు ఇవ్వడము ప్రత్యుపకారముగా నేర్పడునుగాని భగవత్ప్రీతికర మెట్లగు ననియంటే ఇందుకు ప్రాచీనశ్లోకము ॥ అత్యాసన్నంపరిత్యజ్యయో నేర్ద త్తంచనిష్ఫలం॥ అనియున్నదిమరియును॥ మనుః॥ శ్లో॥ శక్తఃపరజనేదా తాస్వజనేదుఃఖజీవిని। మధ్వాపాతోవిషాస్వాదస్సధర్మప్రతిరూపకః॥

శ్లో॥ భృత్యానాముపరోధేనయత్కరోత్యౌర్ధ్వదైహికం। తద్భవేదసుఖోదర్కం జీవతశ్చ మృతస్యచ ॥ అనియున్నది, అనగా, తనజనము దుఃఖముచేతజీవించుచుండగా శక్తుడయ్యును పరజనవిషయుడైయిచ్చువాడగునేని, అది, పైకితేనెవలె నుండి పిమ్మట విషమును బోలెడు, ధర్మప్రతిరూపకము. అనగా ధర్మమువలె నుండు నధర్మము. అని భావము.

భృత్యులను గష్టపెట్టి, తా నేధర్మముచేయుచున్నాడో, అది తనకు నిహమునందును బరమునందును, నసుఖంబు గలుగజేయును. అనిభావము. గనుక ఆశ్రితపోషణముఖ్యధర్మమైయున్నది.

రెండవది.—తత్వములనుదెల్పుజ్ఞానకాండము ఇదియుక్తిసహితమునై మనస్సాక్షికి రాదగినయంశములుగలది.

అయితే వారివారి వేదశాస్త్రములయందుండు తత్వాంశములుకొన్ని కొన్నివాస్తవములు కావు ఏలనంటే కొన్ని యుక్తిసహములు కాకయు, నేకవాక్యతలేకయు, సున్నంతునసనిజములైన సూత్రములు కాజాలవు ఆవిరోధములు ఈగ్రంథములో వెనుక వివరించుచున్నాడను. ఇందువల్ల కేవలము మనస్సాక్షికి వచ్చు తత్వాంశములను జేర్చి యీగ్రంథమువ్రాయవలసి వచ్చినది. ఇదికారణము.

—(*) ఈగ్రంథము వ్రాయుసాహసము. (*)—

ఏమనగా సమస్తమైనమతస్థులువారివారి వేదశాస్త్రములరీతిగా తత్వములనమ్మి ప్రవర్తించుచుండగానందుకు భంగముగానితెరవుతప్రతిక్షేపపూర్వకముగా నేను ఈగ్రంథమును వ్రాయడము సాహసమేను.

అయితే యుక్తిసహములుకాకయు మనస్సాక్షికి రాకయునుండినా ఆతత్వములే ప్రమాణములని అంధపరంపరగా నాయామతస్థుల నెంచుకొమ్మని భగవదుద్దేశ్యములేదు ఇందుకు భాగవతములో దశమ మందు శ్రుతిగీతాప్రారంభమునకు పూర్వము॥ శ్లో॥ బుద్ధీంద్రియమనః ప్రాణా

జ్ఞానానామసృజత్ప్రభుః। మాత్రార్థంచ భవార్థంచ ఆత్మనేకల్ప నాయచ॥ అనిచెప్పియున్నది. ఇందుకు బుద్ధీంద్రియమనః ప్రాణములను జనులకుప్రభువైన దేవుడు కలుగజేసియున్నాడు ఏలయనగా నైహికాము ష్మికములయందు వాడుతనకు మేలుగలుగజేసుకొనుకొరకు అనిభావము కాబట్టి వాడివాడి బుద్ధిచేత నాలోచించితే యుక్తిసహములుగా తన మనస్సాక్షికిరాని యంధపరంపరాప్రాప్తములైన తత్తచ్ఛాస్త్రోక్త తత్వములను ఎట్లునమ్మిప్రవర్తించవచ్చును ॥శ్లో॥ గతానుగతికోలోకో నలోకః పారమార్థికః॥ అనగా, లోకముముందుబోయినవారివెంటనే పోవునది వస్తుస్థితి నెఱుగునదిగాదు. అన్యాయముగా నిష్ఫలముగ అందఱు ఆ దేలాగున ప్రవర్తించుచున్నారు. అట్లుప్రవర్తించుటలో, అందుల లోపలోపములుండినట్లులయితే తనకేయనర్థముగాదా?

అయితే యామతస్థులకందఱికిచెర్పువస్తేనాకురానిమ్మనిఆయా శాస్త్రమతాభిమానమునుంచుకొనిప్రవర్తించడముబుద్ధిలేనిపశుధర్మముగాని ఋషులవ్రాసినశ్లోకప్రకారముగ మనుష్యధర్మముగాదు.

అయితే నీకుదోచినప్రకారము నీవునడుచుకొనవచ్చునే వారి వారికి తమమతేములయందు సంశయములుగలిగేలాగున ఇతరమతప్రతి క్షేపపూర్వకముగానీగ్రంథమును వ్రాసియేలప్రచురము చేయవలయు ననితలచెదరు. ఇందులోనందరికి మేలుగలిగేనిగానే యున్నందున సున్నతామసంపాదించినపదార్థములను తామేయనుభవించవలెనన్న లోభమువారు దేవుడుకలుగచేయనందుననున్ను యీగ్రంథము వ్రాసి ప్రచురముజేసితిని.

## (✿)లోకతత్వనిరూపణ(*)

ఏమనగా నీశ్వరమతస్థులశాస్త్రములలోనుండుయుక్తి సహముగానో మనసాక్షికి రాదగినయంశములు నీశ్వర మతసు లందఱును

ముఖ్యముగా నొప్పుకొని యుండునవి సర్వశక్తిగల భగవంతు డున్నా
డనియు ఆయననుస్మరించుచు వారివారి సద్ధర్మములను దప్పక దేవుడికి
భయపడి సర్వమునకు దేవుడే గతియని దృఢవిశ్వాసముతో నడుచుకొ
మ్మని ముఖ్యముగా జెప్పియుండునవియే యీగ్రంథములో వ్రాయ బడు
చున్నవి. ఇందువల్లనివి సేశ్వరమతస్థులకు నాక్షేపణీయములు గావు.

అయితే మధుమక్షికము కిట్టమును ద్రోసివేసి మధువును గ్రహించినరీతి
గా నన్నిమతములలోను మనబుద్ధికియుక్తికి రానితత్వాంశములను ద్రో
సివేసి మనస్సాంతికి వచ్చునంశములు మాత్రము. ఈగ్రంథముగా వ్రాసి
నాడను. గనుక లోపములున్నయెడల క్షమించి సేశ్వర మతస్థులందఱు
నీగ్రంథమును అంగీకరింతురని నమ్ముతాను అట్లంగీకరించక యీర్ష్యా
సూయలతో నీగ్రంథమును నిందించువారికి నేనుభయపడను ఏలనంటే శ్రీ
మహాభారతము తెనుగులో ॥గీ॥ బుద్ధిమంతులవలనదుర్బుద్ధులధికు। వలన
హీనులురూపసివలనఁజెనఁటి । వీరసూయలు సేయుదుర్నీరసమున। నిం
దయు నెఱుంగవలదె దేవయానివత్స ॥ అనియున్నది కాబట్టి విద్యాబుద్ధులు
లేనివారు గుణగ్రహణము చేయజాలక మొదట మేలోచన లేక దూషిగా
పిచ్చియాక్షేపములు చేయుదురు ఇందుకు ॥ శ్లో ॥ దహ్యమానా స్తీ
వ్రేణనీచాః పరయశోగ్నినా। అశక్తాస్తత్పదంగంతుం తతోనిందాంప్ర
కుర్వతే ॥ అనియున్నది అనగాతీవ్రమైనపరులకీర్తియనునగ్నిచే నీచులు
దహింపబడుచు, తత్పదముబొంద నశక్తులు గావున వారల నిందించు
చున్నారు. అనిభావము. కాబట్టి అదినాకు భూషణమేను. ఏలనంటే
తమతమ మతములలో నేను జెప్పియుండు తత్వదోషములను మధ్యస్థు
లైన బుద్ధిమంతులయెదట పరిహారము చెప్పినన్ను ఒప్పించలేక అశక్త
దుర్జనస్వభావముతో దూషించడము నాకు భూషణమేను ఎట్లనగా
సింహమునుచూచి శునకము మొరగునట్లు. ఇందువల్ల తనలోపమును

నాయతిశయమును స్ఫుటముగావారు బయలు పరచు కొన్నట్టుగును వారలకు నింతే ప్రయోజనము. కాబట్టి యీగ్రంథమును వ్రాయు చున్నాను.

—(✽) గ్రంథారంభము. (✽)—

అయితే యీమనస్సాక్ష్యగ్రంథములో నందఱికి దెలియుటకు సులభముగా నతి సంగ్రహముగా చేలిక యగు వాడుకమాటలతో వ్రాయుచున్నాడను.

ఏమతకర్తలున్ను మనస్సాక్షికముగా సాలోచింపక నే నానా విధములుగ శాస్త్రములలో జెప్పియున్నారు యేలనంటే యెట్లుచెప్పి నను యెట్లుజేసినను సుఖదుఃఖాదులందరికి వారివారియదృష్టానుసార ముగా గల్గుటను బట్టి నిర్భయముగాసుఖడంభ ద్రవ్యలోకసంగ్ర హార్థముగబక్షపాతముచేత మతగ్రంథములు వ్రాసిరిసుఖదుఃఖములు వారివారి యదృష్టానుసారముగ భగవంతుడు జరిపించు విషయమై దృ ష్టాంతముగ్రా సెదను-వారువారుభగవదంశములని చెప్పు రామకృష్ణులు క్రీస్తుమహమ్మదుమొదలగువార్లవిషయములలో నేమి, కొందఱికి వార్ల సంతతివార్ల విషయములలో నేమి, జరిగినకష్టములు దుర్మరణములు యోచించితే, తెలియు చున్నది ఇంతయేగాక అయోని జావతార మనిచెప్పంబడు నృసింహావతారము సంగతి విష్ణుభక్తులు కల్పించి చె ప్పినదిగానున్నది ఏలనంటేహిరణ్యకశిపుడు తపస్సుకు వెళ్లినప్పుడు ఆయనభార్య ప్రహ్లాదుడిని గర్భమందు గలిగి యున్నట్టున్నది అనేక దివ్యసంవత్సరములు తపస్సు చేసి వరముల బొంది వచ్చి హిరణ్యకశి పుడు అనేక సంవత్సరములు ప్రభుత్వముజేసిన వెనుక అప్పుడు చదువు కొనుబాలుడుగా నుండు ప్రహ్లాదునికొరకు నృసింహరూపము వె త్తినట్టున్నది.

ఈకాలవ్యత్యయ విరోధమును యోచించుడు. మరియును శివ భక్తులు యీనృసింహుడువల్ల తెలియకలోకములను పాడుచేయుచు నుంటే శివుడుశరభావతారమెత్తి యీనృసింహుని జంపినట్టు శరభోప నిషత్తులోను స్కాందాది పురాణములలో నున్ను వ్రాసియున్నారు ఇట్లనేయీశరభుడిని విష్ణుశార్దూలావతారమెత్తి చంపినట్టుశాస్త్ర ములలోనున్నట్టువింటాను యిందువల్ల శానామట్టుకు యీవిషయముల లో నాయాభక్తులు నిర్భయముగా కల్పించిన యంశములు ఇట్టివి శా నాయున్నవి యీలాటి వాటిలోనున్నుశివకేశవులు ఒకరినొకరు చంపి నట్టున్నదియిందువల్ల నెప్పటికిన్ని వారివారియదృష్టప్రకారముగ దేవు డు జరిపించే తీరుననీ యోచించవచ్చును.

అయితే దేవుడు సర్వశక్తి గలవాడు గనుక యనన్యగతిక శర ణాగతి వలన దేవుడికి దయ వచ్చిన యెడల వారి కష్టములను బోగా ట్టనున్ను గలదు అని తోచుచున్నది.

—(*)సర్వమతములు చేసిన పత్రయము.(*)—

లోకములో నుండు మతము లన్నియు అనాత్మాత్మ పరమాత్మ వాదులమతములను నిమ్నాఘు మతములలో నేయంతర్భూతములు కొ న్నికొన్నిమతములు స్వల్పభేదములు మాత్రము కలిగి యున్న వేగాని తర్కింపగా సమష్టిపరకాష్ఠ లిమ్నాడేయగునుఅనాత్మవాదులమతమైన గాస్వభావవాదుల మతము ఆత్మవాదుల మతమనగా జీవబ్రహ్మ వా దుల మతముపరమాత్మవాదులమతమనగా చిదచిత్తులకు నీశ్వరుడైజగ, త్కర్తయైన పరమాత్మనుపాసించు వారిమతము.

—(*)అనాత్మవాదుల మతస్వరూపము.(*)—

స్వభావవాదులు ప్రపంచము స్వభావమువల్లగలిగినదని చెప్పు చున్నారు అట్లగుపక్షమునవస్తుస్వభావములను దెలుపున్యాయశాస్త్రం

టులనున్నప్రకారముగరసవాదములవలనగానియోగాదులవలనగానివా
ట్లవాట్లస్వభావములచేత నణిమ్మాదిసిద్ధులుగలుగజేసికొని జరామరణా
దులుగలుగకుండ నెల్లప్పటికిబ్రతికియుండవచ్చును మఱియునుదానురూ
పాంతరముబొందుటయు బరకాయప్రవేశంబు చేయుటయు జచ్చిన
ప్రాణులబ్రతికించుటయు ననునీలాటిపనులను జేయవచ్చును అట్లులేదు
కాబట్టి అట్లుచెప్పగూడదు.

ఏలననగా స్వభావము జడమాటచేతనున్ను అందువల్లవస్తువ్రులు
గాని వస్తుగతస్వభావములుగాని తమంతటగలుగజాలవు గనుకనున్ను
అయ్యావి ప్రప్రథమమందు సర్వజ్ఞత్వసర్వశక్తత్వాదులుగ్లవాడు అనే
కోపయోగముల కొఱకు యోచించి నిర్మించవలసినదిగా నుండుటచే
తనున్ను ప్రపంచము తనంతట గలిగినదని చెప్పగూడదు ఏలాగంటే లో
కములో నచేతన వస్తువులయందుండుదత్తత్స్వభావముల నెఱింగి చే
యుటకుగర్త యొకడులేకయే గడియారము టిల్లిగ్రాం పొగబండి మొ
దలైనవితమంతటకాజాలవు అచేతనమిశ్రితశిల్పము లేగలుగుటకునిట్లుండ
గా జేతనాచేతనమిశ్రితచిత్రవిచిత్రప్రపంచము పరమకర్తలేనిదైకాజాల
దు. ఈలాటిప్రత్యక్షానుమానప్రమాణయుక్తులెన్ని జెప్పినను ఒప్పుకొనక
మొండివాగమచేయు నాస్తికులతో పూర్వము ఆస్తికులుచెప్పినయీక
డపటియుక్తివల్ల నాస్తికులుగూడ యుక్తిచెప్పజాలక పోయినారు ఏదనగా॥
శ్లో॥ నాస్తిచేన్నాస్తినోహాని రస్తిచేన్నాస్తికోహతః॥ అనిచెప్పినారు.

అనగాభగవంతుడులేనిపక్షమందు ఆస్తికునికిహానిలేదు ఉన్నప
క్షమందునాస్తికుడు ఈశ్వరుడులేడని చెప్పటవల్ల ఆయనచేతశిక్షింప
బడుచున్నాడు అనియున్నదిగాపునస్తికులును స్వభావవాదులు నైన
యునాత్మవాదుల మతము సరిగాదు. ఈవిషయమువిపులముగానేనుజె
ప్పిననాస్తికధ్వాంతభాస్కరములో నున్నది చూడుడు.

## —(*) ఆత్మవాదుల మతస్వరూపము (*)—

జీవబ్రహ్మావాదులునైన శాంకరాద్వైతులు జీవబ్రహ్మైకమని యు తక్కినవిమిథ్యయనియు జెప్పుచున్నారు అజ్ఞానదుఃఖాదు లనుభవించుచున్నందున దనజీవాత్మ పరమాత్మ కానేరదు.

అయితే భ్రమచేతనజ్ఞానోపాధిలోజిక్కి యాపరమాత్మజీవాత్మయై దుఃఖాదు లనుభవించుచున్నాడను నెడల భ్రమించువాడు భ్రమాధారరజ్జువు బూర్వముచూడబడుసర్పము నీమూడులేకయేభ్రమగలుగదు ఇన్నియుంటేద్వైతముగలుగును ఇందువల్ల జగన్మిథ్యాత్వనిరసనమాయెను మరియునుభ్రమయెవరికి బ్రహ్మముసర్వోపాధివినిర్ముక్తుడునిర్గుణుడు నిర్వికారుడు అవ్యక్తుడు అతీంద్రియుడుఅద్వితీయుడు సత్యజ్ఞానానందస్వరూపుడుననియు జగత్తుమిథ్యయనియు వారేచెప్పుచు నట్టిబ్రహ్మమునకు భ్రమయెట్లుగలుగుననియంటే ఆభ్రమయనుభ్రమయేయనిచెప్పుచున్నారు ఆపక్షములోరజ్జుసర్పభ్రమముగూడా భ్రమయయ్యేనేని సర్పము యథార్థము కావలసివచ్చును అలాగువలన ప్రపంచముయథార్థమే కావలసివచ్చును మరియుమ్మపారూపమాయోపాధివలన ఈశ్వరుడైతాను బహువిధములయ్యెద నని సంకల్పాదులు గలిగి యబద్ధమైన యవిద్యచేతననుపాధులుగల్పించి యందుదాను ప్రవేశించియు పాధివలనలేశవ్యవస్థగలిగి జీవాత్మయైయజ్ఞానదుఃఖాదు లనుభవించుచున్నాడని వారుచెప్పుచున్నారు ఇట్లైట్లెచెప్పనగును ఆపక్షములో మాయావిద్యలకు సత్యత్వమున్నాబ్రహ్మమునకు నిర్గుణనిర్వికారాద్యనుపపత్తియు గలుగును. ఇంతేగాక ప్రపంచము మిథ్య (అనగాదబ్బర)యనియిందుకు స్వప్నదృష్టాంతము చెప్పుచున్నారు.

ప్రపంచము స్వప్నమువలె మిథ్యయయ్యేనేని ప్రపంచపదార్థములు అర్థక్రియాకారు లెట్లగును అనియంటే స్వప్నములో స్త్రీయాదు

స్ఖలనాద్యర్థక్రియలు గలుగలేదాయని చెప్పుచున్నారు స్వప్నములో విషయములుగనపిడిజ్ఞానముఅర్థక్రియాకారియైన స్ఖలనాదులు గలిగించినదే గాని విషయమైన స్త్రీ చేయునఖదంతక్షతాదులు వీనియందు గలుగలేదు గనుక స్వప్నవిషయములు అర్థక్రియాకారులు కాలేవు అని చెప్పితే స్వప్న పదార్థంబులు స్వప్నములో అర్థక్రియాకారులైనట్లు తెలియరాలేదాయని జవాబు చెప్పుతారు ఆయా స్వప్నపదార్థము లా స్వప్నపర్యవసానము లోపోవుచున్నవి జాగ్రత్తలో ననుభూతపదార్థములు సుషుప్త్యాద్యవస్థా వ్యవధానములు గలిగినను తిరిగి జాగ్రదవస్థలయందు ఏకరూపములుగా నుండుటచేత స్వప్నదృష్టాంతము చెప్పగూడదు ఇందువల్లనే వ్యాససూత్రములలో ద్వితీయాధ్యాయమందు ద్వితీయపాదములో ౨౮, ౨౯ సూత్రములలో, నాభావఉపలబ్ధేః వైధర్మ్యాచ్చనస్వప్నాదివత్, అని చెప్పబడి యున్నది మరియు మాండూక్యోపనిషత్తుకు గౌడపాదాచార్యులవారు చేసిన కారికలలో సృష్టిప్రకరణమందలి పరపక్షోపన్యాసములో, స్వప్నమాయాస్వరూపేతిసృష్టిరన్యైర్వికల్పితా, యని చెప్పి, దేవస్యైషస్వభావోయమాప్తకామస్యకాస్పృహా, అని సిద్ధాంతము చేసియున్నారు ఇంతే గాక చక్షురాది విషయమై అర్థక్రియాకారియగు ప్రపంచము భ్రమయయ్యేనేని పుణ్యపాపములే లేకపోవలసివచ్చును మరియును భ్రమకు విషయంబేదోగాన రాదు భ్రమకు విషయంబగు పదార్థము కనుపించ నప్పుడు భ్రమయనుశబ్దమునకు ప్రవృత్తినిమిత్తకమెట్లో యోచించుడు ఇందుకు జగత్తుమిథ్యయని బ్రహ్మ సత్యమని చెప్పుచున్నారు ఎట్లనగా నిర్వికల్ప సమాధిలో ప్రపంచము తోచదు గనుక ప్రపంచము మిథ్య యని చెప్పుచున్నారు.

ఇందుకు నిద్రామూర్ఛాదులలో ప్రపంచము తోచలేదే యింతమాత్రము చేతనే ప్రపంచము లేదని యెట్లు చెప్పనగును ఆకా

లమునందు ఇతరులకు గూడా ప్రపంచము లేకపోవునా? మరియును ప్రపంచమును జూచి ఇందుకు గర్త యుండవలెనని యగుపడని బ్రహ్మము ననుమాన ప్రమాణముచేత నంగీకరింప వలసినదిగా నుండునపుడు జగత్తే అబద్ధమైతే బ్రహ్మము నెందుకు నంగీకరింప వలెను. ఇందుకు భోజప్రబంధాంతర అద్వైత మత ఖండనమందు॥ శ్లో॥ జగన్మృషైవేతి భవన్మతంచేత్కిం కల్ప్యతే బ్రహ్మ నిరర్థకం తత్। ఆకారణస్యైవ గతక్రియేణ కర్తవ్యమేతేన కిమ స్తిలోకే॥ అని యున్నది॥

అనగా జగత్తు అబద్ధమని మీమతములో నున్నట్లాయెనా యెందుకు నిరర్థకముగా బ్రహ్మమును గల్పించ వలసినది బ్రహ్మమిట్టివాడని చెప్పుటకు వల్లలేకపోయెను సంకల్ప సృష్ట్యాది క్రియలు లేక పోయెను అట్టి బ్రహ్మము అబద్ధమైన ప్రపంచమున కేమి యుపయోగము అని యిట్లుజెప్పబడి యున్నది మఱియును భగవద్గీతలలో॥ శ్లో॥ అసత్యమప్రతిష్ఠంతే జగదాహు రనీశ్వరం। అపరస్పర సంభూతం కిమన్యత్కామ హైతుకం। ఏతాందృష్టిమవష్టభ్య నష్టాత్మానోల్పబుద్ధయః? ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయజగతో హితాః॥ అని జగదసత్యత్వాది నిరాకరణము చేయుబడి యున్నది మరియును॥ శ్లో॥ జీవఈశో విశుద్ధాచి త్తథా జీవేశయోర్భిదా। అవిద్యా తచ్చితో ర్యోగ, షడస్మాక మనాదయః॥ అని అద్వైతులు చెప్పెదరు ఇందుకు అర్థము జీవుడు, ఈశ్వరుడు, విశుద్ధచిత్తు అనగా పరబ్రహ్మము, జీవునకు ఈశ్వరునకు నుండు భేదము, అవిద్య, అవిద్యకు చిత్తుకు నుండు సంయోగము. నీయారు అనాదులని భావము. ఆదిలేనివాటికి నంతము గలుగదు అంతము గల్గు పక్షమున నీయాఱింటిలో జేరిన విశుద్ధ చిత్తయిన పరబ్రహ్మమునకున్ను అంతము గలుగ వలసి వచ్చును అన్నిటికి అంతముగలిగి దీనికి అంతము గలుగదని చెప్పుమాట, వారి శిష్యు లొప్పుకోన్నవల.

సిన మాటగా నున్నదిగాని శ్లోకశైలిని బట్టి మనస్సాక్షికి రాదగిన మాటగాదు. మఱియు విశ్వగుణాదర్శమందు. ౬౭౩, శ్లో॥ దృశ్యం మిథ్యా దృష్టికతాఽపి మిథ్యా దోషోమిథ్యేత్యేవయా ధీరమీషాం। సాధిష్ఠానాం శేషి. కింనేతి చింతా సాధిష్ఠానాం పండితానా ముదేతి ॥ అని యున్నది అవగా దృశ్యంబును, ద్రష్టయును, దోషంబును మిథ్యయను ఏబుద్ధి ఈయద్వైతులకు గలుగుచున్నదో ఆబుద్ధిఅధిష్ఠానరూప బ్రహ్మాది విషయమందును ఎందువలన కలుగదు అనుచింత శ్రేష్ఠపండితులకు బొడముచున్నది అనుట. గాన్నున నాత్మవాదుల మతము సరిగాదుగ ఇందువలన జడప్రాయమై బట్టబయలీ వంటి నిర్గుణబ్రహ్మ మున్నాడని చెప్పుటయు లేనిప్రాయమే యగును.

ఇరదులో ప్రసక్తాను ప్రసక్తముగా నొకసంగతి వ్రాయుచున్నాను. అద్వైతులమీద. పోటీకి రామానుజ మత వైష్ణవులు తమ మతము విశిష్టాద్వైత మని పేరు పెట్టుకొన్నారు. ఇందుకు హేతువు ద్వైతాద్వైత నిర్వికార సవికార శ్రుతులకు సామంజస్యము గలుగుట కని చెప్పు చున్నారు విశిష్టాద్వైతము అని చెప్పుటవలన నిర్విశేష శ్రుతికి విరోధము గలుగుట అట్లుండగా బ్రహ్మమునకు చిదచిత్తులు అపృథక్ సిద్ధ విశేషణము లని చెప్పుటవలన నచిద్గత వికారములు చిద్గతాజ్ఞాన దుఃఖాదులు బ్రహ్మమునకు కలుగ వలసి వచ్చు నని యడిగితే యచిద్గత వికారము ఉపాదాన కారణశ్రుత యుండుట వలన బ్రహ్మమునకు సద్వారముగా గలుగు చున్నదనియు చిద్గతాజ్ఞాన దుఃఖాదులు బ్రహ్మమునకు లేవని శ్రుతి యుండుటవలన నవి సద్వారముగా నైన గలుగ వనియు జెప్పెదరు. రెండు విశేషణములు దీపమునకు ప్రభవలెనే అపృథక్సిద్ధ విశేషణములుగా బ్రహ్మమునకు నుండునపుడు ఒకవిశేషణ గత ధర్మము

సద్వారముగా బ్రహ్మమునకు గలుగడమును, మఱియొక విశేషణగత ధర్మము సద్వారముగా నైన బ్రహ్మమునకు గలుగక పోవడమును ఇంతకంటె నేమి యసంగత మున్నది.

మఱియు విశిష్టము అద్వైతము అనుదానికి అర్థ మడిగితే, కారణ దశలో నుండు సూక్ష్మ చిదచిద్విశిష్ట బ్రహ్మమునకును, కార్య దశలో నుండు స్థూల చిదచిద్విశిష్ట బ్రహ్మమునకును అభేదము అని అర్థము చెప్పుచున్నారు. ఇది యేమి పిచ్చిమాటో యోచించుడు! ఎట్లనగా, జగత్సృష్టికి పూర్వమున నుండు బ్రహ్మమునకును, సృష్ట్యనంతరమున నుండు బ్రహ్మమునకును, భేదమని యెంత పశువున కైనా సంశయము గలుగునా? అట్టి సందేహము గలిగితే గదా ఆసంశయ నివారణము కొఱకు అద్వైత పదము ప్రయోగింప వలెను.

కాబట్టి విశిష్ట మతమని చెప్ప వచ్చును గాని విశిష్టాద్వైత మతమని చెప్పుట సరిగాదు.

మఱియు, జగత్తు మిథ్యయని చెప్పువారికి పోటీకి జగత్తు సత్యమని చెప్పుచున్నారు. ఎట్లనగా. స్వప్నంబును భ్రమయును వస్తువుల రూపనామంబులును ప్రపంచములో జేరినవేగాన నివియును సత్యంబులే యని చెప్పుచున్నారు. ఎట్లనగా జగత్తు స్వప్నము వంటి మిథ్యయని శాంకరా ద్వైతులు చెప్పు చున్నారు. వారిమీద పోటీకి స్వప్నములో రథములు, రథ్యములు దేవుడు సృజించు చున్నాడని యొక శ్రుతిని జెప్పి యిది సత్యమని చెప్పుచున్నారు. అది సత్యమైతే స్వప్న విషయములు అర్థక్రియా కారులు కావలసి వచ్చును. భ్రమ సత్యమను విషయమందు: రజ్జు సర్పాది భ్రమ దృష్టాంత విషయములలో, రజ్జువందును సర్పమందును పంచీకరణ ప్రక్రియచేత పంచభూతావ యవములే యుంటున్నవి. అయితే. కొన్ని దోషముల.

చేత సర్వావయవములు ప్రతిభాసించి నందున సర్పమని తలచేదరు గావున యీజ్ఞానము ప్రమయేగాని భ్రమ కాదని చెప్పుచున్నారు. అట్టి జ్ఞానము ప్రమయయ్యెడి పక్షమందు సర్పమందుండు నర్థక్రియలు రజ్జువందు గలుగ వలసి వచ్చును ఇంతేగాక తల్లి నిద్రించుచుండగా జీకటిలో భార్య యని క్రీడించిన యెడల మాతృ భార్యల యుభయ శరీరముల యందు పంచ భూతావయవములే యుండుటను బట్టి యదిదోషావహమే కాక పోవలసి వచ్చును. మరియు నీ మతము నందు స్వప్నంబును భ్రమయయును ప్రమయయ్యేనేని భ్రమకు విషయమే లేక పోయెనే ? లోకములో భ్రమ శబ్దమునకు ప్రవృత్తినిమిత్తక మెట్లని యంటే, రజ్జుసర్పాదుల యందు పంచభూతావయవములే యుండినను కొన్ని దోషముల వలన రజ్జు వందుండు భూయస్త్వావయవములు ప్రతిభాసింపక సర్పము నందుండు చాకచక్యాదులు ఆరజ్జువు నందు తోచినందున, సర్పముగా దోచుట అది భ్రమ యని చెప్పుచున్నారు. ఆపక్షము నందును రజ్జువందుండు విశేషముగా నుండు నవయవములు తోచక లేని సర్పావయవములు రజ్జువందు తోచుట అవి సత్య మెట్లగును.

మరియు వస్తువుల రూపనామంబులు సత్యము లెట్లు దీపాదులు అవి పుట్టక ముందును నశించిన వెనుకను వాటి యునికిలేనప్పుడు రూపముగాని తత్ప్రయుక్త నామము గాని, యెట్లు సత్యముగానుండును అని యడిగితే యుక్తి చెప్పజాలక కోపముచేత మీకు దెలియదని దురుక్తులచేత శేషపూరణము చేయుచున్నారు.

అయితే మీరీప్రపంచము నేమని చెప్పెదరంటే, తత్వప్రశ్నరత్నాపక ప్రార్థన శ్లోకముల యందు ఈలాటవి నిశ్చయింప సాధ్యములు గావను సంగతి దెలుపు చున్నాను, అయినను వేద శాస్త్ర

ములలో ప్రపంచ దృష్టాంతములుగ రజ్జుసర్పము, మరు మరీచిక, స్వప్నము, మృద్ఘటము, జలబుద్బుదము, తంతుపటము, ఊర్ణనాభి, ఇవిమొదలయినవి చెప్పబడియున్నవి, వీట్లకు మతస్థులు చెప్పుసాధర్మ్యములు ఒకదానియందుండు నవి యొకదాని యందులేవు అయితే మాకు నొక సాధారణధర్మము మాత్రము అన్నిటియందుగనుపించుచున్నది యేదియనగా అనిత్యత్వము. ఇందుకుగీతలలో ద్వితీయాధ్యాయములో॥ శ్లో ॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్త మధ్యాని భారత । అవ్యక్త నిధనాన్యేవ తత్రకా పరివేదనా॥ అనియున్నది గావున ప్రపంచపదార్థములు వానివాని యుత్పత్తికి పూర్వము లేక వానివాని యంతమునకు వెనుకను లేక పోయిన మాత్రముచేత మిథ్యయనిగాని వర్తమానకాలములో నర్థక్రియా కారులగుటచేత త్రికాలాబాధ్యములైన సత్యములని గాని చెప్పగూడదు. ఇందువలన ప్రపంచము అనిత్యమని చెప్పవలసినట్టు తోచుచున్నది.

—(*) పరమాత్మవాదుల మతస్వరూపము. (*)—

పరమాత్మవాదుల్లు చిదచిత్తులకు, నీశ్వరుడై జగత్కర్తయైనవాడు, పరమాత్మయని చెప్పుచున్నారు. ఇది సత్యము, సర్వేశ్వరుడు సర్వజ్ఞుడు సర్వశక్తిస్వరూపుడు, సర్వవ్యాపకుడు, సర్వకారణకారణమునైన, పరమాత్మచేయుకయే, చేతనాచేతన మిశ్రితమైపరిమితిలేని అనేకోపయోగములు గల యీచిత్రవిచిత్రప్రపంచము గలుగజాలదు ఇతరులు చిదచిన్మిశ్రితము చేసి నూతనముగా నొక తృణమునైన బుట్టించగలరా కాబట్టి పరమాత్మవాదుల మతమే యుక్తమము.

—(*) శివనారాయణాదిరూపములు సందిగ్ధములగుట. (*)—

అయితే శివనారాయణాది రూపములు కాల్పనికములనియు

పాసించుట సరికాదని తోచుచున్నది. ఏలనంటే పరిపూర్ణుడును అవా ప్త సమస్తకాముడు నగు పరమాత్ముని వైకుంఠ కైలాసాదిస్థిత పరి చ్ఛిన్నరూపునిగా భావించుట తగదు దీనికి స్కాందశంకర సంహిత దక్షకాండ ౧౫ అధ్యాయములో బ్రహ్మవిష్ణ్వాదులకు ఆయుఃప్రమా ణము చెప్పియున్నది మరియు నారాయణ శివాదులకు విష్ణుపురాణము బ్రహ్మాండ పురాణము మొదలయిన వాట్లలో నాయుః ప్రమాణము చెప్పియుండుటయే గాక, యజ్ఞాన దుఃఖాద్యనుభవమ్మును గలిగియు న్నట్లు త్రిమూర్తులను దెలుపు శాస్త్రపురాణముల వలననే తేట పడుచుండగా నయ్యావి కారణస్వరూపము లని యెట్లు చెప్పనగును. ఇందుకు గొంచెము వ్రాయు చున్నాను. బ్రహ్మ, కూతురిని మో హించి రమించె ననియు పార్వతి స్తనములు చూచి బ్రహ్మకు రేత స్ఖలన మైతే శివుడు బ్రహ్మయైదవ తల పగల గొట్టెననియు శివుడు, తన తల్లియైన యాదిశక్తిని రమించె ననియు, శివ విష్ణువులు భార్య లను పోగొట్టుకొని, దుఃఖితులై, యొకరు తపస్సు చేసి, యొకరు సముద్రము మథించి, నూతన భార్యలను సంపాదించి కొని రనియు చెప్పి యున్నది. మరియు శివుడు విష్ణువును మోహినీవేషము వేసు కొమ్మని చెప్పి ఆయన, వేషము వేసుకుంటే స్త్రీయను భ్రాంతితో తరిమి పట్టుకొని రమించితే విష్ణువు ఓర్వలేక శీనాశ్రమ పడి నట్టు న్ను ఆవల శాస్తయను కుమారుని కనుకున్నట్టును యున్నది. ఇవి యెంతః యజ్ఞానపు సంగతులో యోచించుడు. మరియు ఋషుల శాపము వల్ల శివుడికి లింగము ఊడిపడె ననియు ఆలింగము లోకము లను దహించుచుంటే విష్ణువు యోనియైందగ్గిరకుబోగా ఆలింగము దానిలో బ్రవేశించె ననియు నీ రెంటిని మోయుటకై బ్రహ్మ పీఠముగా నేర్పడె ననియు మరియు విష్ణువు శంఖచూడుని భార్యను మోస

ముగా రమించి నందున ఆమె శాపము చేత పాషాణ రూపముగా సాలగ్రామమైనాడనియు ఋషులశాపముల చేత విష్ణువు అనేకావతారము లెత్తె ననియు నిట్టి యసహ్యాకరమయినవియు వ్రీడాకరమైనవియు జుగుప్సాకరమయినవియూ, నగు నిట్టిమాటలు విప్రులు తమ యతిశయమును దెలుపుకొను కొరకు వేదశాస్త్రములలో వ్రాసిరి యిందు వల్ల శివకేశవాదులు పరాధీనులు గాను, అజ్ఞాన దుఃఖాదులనుభవించు వారుగాను, యేర్పడుచున్నది గాన, నివి భగవద్రూపము లని యెట్లు చెప్పవచ్చును.

అయితే సర్వశక్తిగల భగవంతుడు స్వేచ్ఛగా నట్టి రూపముల ధరించియు నుండవచ్చును గాని భాగవతములో పురంజనోపాఖ్యానము వలె మన వేదశాస్త్రములలో, నుపాసనార్థముగ, జెప్పబడిన రూపములుగా దెలియుట వల్ల నిజములని నమ్మదగినట్టు తోచలేదు, ఒకడైనపరమాత్మకే కార్యభేదమువలన త్రిమూర్తులని యుపాసనార్థముగా రూపములు గల్పించి నట్టు లేర్పడు చున్నది యెట్లనగా, బ్రహ్మయనగా అందరికి గొప్పైనవాడు అనగాపరమాత్మయు జగత్తు సృజించు కార్యముల వలన రజోగుణవంతు డనియు, సృష్టికాధారముగ ప్రకటింప బడిన వేదములు, అర్థవచ్ఛబ్దరూపములని చెప్పుట వలన సరస్వతి భార్య యనియు, నాశబ్దములు వాగ్జన్యములు గనుక ముఖమందు సరస్వతి నుంచుకొన్నాడనియు, విష్ణువు అనగా సర్వవ్యాపకుడయినవాడు అనగా పరమాత్మయు జగత్తును పాలించు కార్యము వలన సత్వగుణవంతు డనియు పోషించుటకు సంపత్తు కావలసినది గాబట్టి భార్య లక్ష్మియనియు దయకు స్థానముహృదయము గనుక యాలక్ష్మిని హృదయమందుంచు కొన్నాడనియు, మహేశ్వరుడు అనగా, నీశ్వరులకు నీశ్వరుడు అనగా సర్వనియామకుడైన

పరమాత్మేను, జగత్తును సంహరించు కార్యమువలన దమోగుణవంతు డనియు నియమించుటకు శక్తిముఖ్యసాధనముకాబట్టి, శక్తిభార్యయని యు నట్టి శక్తి తనవలెనే సర్వవ్యాపముగా నుండవలసినది ఆవశ్యక ము గాబట్టి యాశక్తిని అర్ధశరీరముగా నుంచుకొన్నాడని యు నావేదశా స్త్రసిద్ధసంకేతములను గూఢాభిప్రాయముతో నాశాస్త్రములందు జె ప్పబడియున్నవి యిట్లనే అష్టదిక్పాలకుల సంగతియు శాస్త్రములలో జెప్పబడియున్నది అదియును సరికాదు, ఎట్లనగా భూమి యాత్మప్రద క్షిణముగా దిరుగుట బుద్ధిమంతులు కనిపెట్టియున్నారుగదా? అట్లుతి రుగు నప్పుడు పూర్వపశ్చిమ దిక్కుల నిర్ణయము ఏర్పడదు, ఇట్లుం డగా బూర్వ దిక్కునకు ఇంద్రు డధిపతి యనియు పశ్చిమ దిక్కు నకు వరుణు డధిపతి యనియు నెట్లు చెప్పనగును కాబట్టి యష్ట దిక్పాలకుల పేళ్లు వాహనాయుధములు పరిభాషగానే చెప్పి యున్నారు ఇట్లు గూఢాభిప్రాయముగా జెప్పుటకు ప్రమాణము ఏకాదశ స్కంధములో ॥ శ్లో ॥ పరోక్షవాదో వేదోయం బాలా నా మనుశాసనం । కర్మమోక్షాయ కర్మాణి విధత్తేహ్యగదం యథా॥ అని యున్నది అనగా బాలురక్కు ప్రత్యక్షార్థమును మరు గు జేసి చెప్పునట్లు ఈవేదము ప్రత్యక్షార్థమును మరుగు జేసి పరో క్షార్థమును జెప్పుచున్నది ఇందుకు దృష్టాంతము తండ్రి బాలునికి ఔషధము ఇచ్చుట కొరకు నెట్లు గుడ లడ్డుకాదులలో ఔషధి మురుగు పరచి యౌషధమును తినుపించు చున్నాడో అట్లు వేదము స్వర్గాది ఫలముల జూపుచు కర్మ మోక్షము కొరకు గర్మము ను విధించుచున్నది అని భావము మరియు నచ్చటనే యుద్ధవునికి గృ ష్ణమూర్తి చేత ॥ శ్లో ॥ పరోక్షవాదా ఋషయః పరోక్షం మమచ ప్రియం । అని చెప్పబడి యున్నది అనగా ఋషులు మరుగుగా జెప్ప

చున్నారు అలాగు మరుగుగా జెప్పుటే నాకు నిష్టము అని భావము ఈ యభిప్రాయము వలననే వేదాంత దేశికులవారు చెప్పిన రహస్య త్రయసారములో తత్వ త్రయాధికారములో అరవము కడపటి పాట లో వాహనాయుధ భూషణాది లింగములు పరిభాషగా జెప్పియు న్నారు. ఇందుకు కవికర్ణ రసాయన మందు॥ (ఉ) శ్రీదయితురిదు దాల్చు మణి జీవుడు లక్ష్మి ప్రధాన మందు) కా । మోదకి బుద్ధిశా ర్ఙ్గ మనసముజ్వల శంఖము లింద్రియాది భూ । తాదులు చక్రముల్ల ము శరాదిక వర్గము వైజయంతి సో । త్పాదక భూత పఙ్క్తి యసి వైకృతి విద్యయు నయ్యవిద్యయున్ ॥ అనియున్నది ఇట్టేరీతిగా కొంచెము ఇంచుమించుగా విష్ణుపురాణం భాగవతములలో నున్నది మరియు విష్ణుపురాణములో॥ శ్లో ॥ సృష్టిస్థిత్యంత కరణాత్ బ్రహ్మ విష్ణు శివాత్మికాం । ససంజ్ఞాం యాతి భగవా నేకఏవ జనార్దనః ॥ జనార్దనుడనగా సృష్టిస్థిత్యంతములను జేయుచున్న పర బ్రహ్మము. ఇతడే చతుర్ముఖబ్రహ్మ, విష్ణువు, శివుడు, నను సంజ్ఞల ను పొందుచున్నాడు అనగా భగవంతు డొక్కడే సృష్టికార్యము వలన బ్రహ్మయను పేరును రక్షణకార్యము వలన విష్ణువను పేరును సంహారకార్యము వలన శివుడను పేరును బొందు చున్నాడని తాత్పర్యము. ఇట్లు రెండుట వల్ల నాపరమాత్మకే జగత్సృష్ట్యాదికార్యములు వల్ల గలిగిన నామము లని తెలుసుకొనవచ్చును ఇట్లు నామరూపా దులు కల్పించుట మందబుద్ధులకు భగవద్విషయక మయిన మతి గల్గి బాహ్య మానస పూజాధ్యానాదులకు ఆలంబన సౌకర్యార్థము. ఇందుకు, "ఉపాసకానాంకార్యార్థం బ్రహ్మణో రూప కల్పనా". అని, యుపనిషత్తులో నున్నది. అయితే, బ్రహ్మమునకు రూపములేక పోతే రూప నిమిత్తకములయిన స్త్రీలింగ పుంలింగములు లేవుగదా!.

పుంలింగ రూపములయిన యీశ్వరాది నామములెట్లు ప్రవర్తించు చున్నవో, స్త్రీలింగ నపుంసకలింగ రూపములయిన దేవతాదినామము లెట్లు ప్రవర్తించు నని యుంటే ఇవి సంస్కృత భాషా సంకేత సిద్ధములు. ఎట్లనగా దార శబ్దము భార్యా వాచక మయినను నిత్య పుంలింగముగా నుండలేదా తద్వత్తుగా నున్నది. ఈరహస్యమును తెలిసికొనజాలక యివి వాస్తవము లని బహుజనులు ఎంచి యున్నారు ఇంతేగాక శ్రీమతేష్టులు నమ్మి భాష్యములు చేయబడిన ప్రసిద్ధమయిన దశోపనిషత్తులలో ఆత్మ, బ్రహ్మము, సత్తు అనియున్నవే గాని చతుర్ముఖబ్రహ్మ విష్ణురుద్రాదుల స్వరూప ప్రస్తావమేలేదు మరికొన్నిచోట్ల నుండలేదా యని యంటే.

—(*) { వేదములలో నన్నిభాగములు ప్రమాణములు కావనుట. } (*)—

వేదాదులందుండుభాగములన్నియు గ్రహింపగూడదు ఇందుకు శ్రీ భగవద్గీతలలో॥ శ్లో॥ యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే। తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్యవిజానతః॥ అనగా పూర్ణమైన తటాకములో దప్పి గలిగిన వానికి తనదప్పి తీర దగిన యుదకము మాత్రమే యెట్లు ప్రయోజనకారిన్నై ఉపాదేయ మగుచున్నదో అట్లు అపారమై యనేకార్థములను బ్రతిపాదించు వేదములలో దెలివిగల బ్రాహ్మణునికి ఆవశ్యకమైనమాత్రమే యుపాదేయమై యున్నది ఇందుకు ఆవేదములలో ప్రత్యక్షమునకు విరోధముగా గొన్నియుప్పితము లుగా జెప్పియుంచునవి కొద్దిగా వ్రాసెదను చంద్రసూర్యాదులు భూగోళము వంటివని నళికా యంత్రములచేత దెలియ వచ్చుచుండగా నవి వేదాదులలో దేవతలనియు భూచ్ఛాయవలనను జంద్రునికి, జంద్రచ్ఛాయవలనను సూర్యునికి,గలుగు చంద్ర సూర్య గ్రహణములు రాహువు గ్రసించుటచే గలుగుచున్నవనియు చెప్పేయాలాటి భాగము

లు వేదములలో నెట్లు నమ్మవచ్చును. ఎచ్చట ననగా ఋగ్వేదము నాలుగవ యష్టకము రెండవ యధ్యాయము పదవ వర్గమందున్నది మఱియు నక్షత్రాశ్రీసులో నళికాయంత్రము వలన సూర్యునికి చలనము లేక భూమి తిరుగుట వలన నుదయాస్తమయములు గలిగినట్లు తోచు నపుడు సూర్యునికి నుదయ మధ్యాహ్న సాయంహ్న సమయములయందు మందేహ రాక్షసు లడ్డపడితే బ్రాహ్మణులు చేయు నర్ఘ్యప్రదాన బ్రహ్మాస్త్రముచేత వారు చంపబడు చున్నారనియు యజుశ్శాఖ అరుణ పంచకములో, ౪ ప్రశ్న ౨ ఖండమునందు జెప్పబడి యున్నది, సూర్యునికి రథము గుఱ్ఱము సారథియు నున్నట్లు తైత్తిరీయమునందు చెప్పబడియున్నది కదలనివానికి నవియెట్లుసంభవించును- మరియు సూర్యునికంటె దిగువనున్న చంద్రుని నెగువ నున్నాడని ఛాందోగ్యమున ప్రపాఠకము ౧౫, ఖండములో అర్చిరాది మార్గము చెప్పినచోటచంద్రుడు సూర్యునికంటె నెగువనున్నట్లు చెప్పబడియున్నది ఇదేవిషయము ఛాందోగ్యము ౫, ప్రపాఠమునందు రెండుచోట్ల కనుపడుచున్నదీ ఇట్టివి యెట్లు నమ్మవచ్చును-

ఇవి నైమిశారణ్యము చలిదేశము భంగు తాగక నిభాయించలేరు అక్కడి ఋషులు భంగు తాగి యేదో అభిప్రాయములు తోచి చెప్పి యుండవచ్చును గాని దేవుడు, ఉండేదానిని అన్యథాగా చెప్పి మనలను మోసము జేయుటకు ఇట్లు జెప్పునా ఇతరమత వేదశాస్త్రములలో పరమాత్మకు రూపాదులున్నట్లు స్పష్టముగా జెప్పబడియుండలేదు ఆవేదములయందును గొన్నికొన్ని భాగములు ఇట్లుపిచ్చిపిచ్చిగానే యున్నవి మనవేదశాస్త్రములే ప్రమాణము లనుటయు సంస్కృతభాష నానార్థములచేతను ధాత్వర్థములను బట్టియు నెట్లు కావలెనంటే అట్లు అర్థములు చేయవచ్చును గనుక ఆవచన

ములకు భావకల్పనలు చేయుచున్నామని ఘటమునకు బటమనియు బట మునకు ఘటమనియు నర్థము చెప్పుట పక్షపాతముగా నున్నది.

—(*) { మన వేదములు దైవప్రోక్తములు గావుఋష్యాదులేచెప్పినవనుట } (*)—

ఇంతయేగాక, మనవేదములు ఋషులు చెప్పినట్టు ప్రశ్నో త్తరముల వలననే గాన వచ్చుటయే గాక శతపథ బ్రాహ్మణములో నగ్ని వాయువుసూర్యుడు నంగిరస్సు వీరివలన క్రమముగా నాలుగు వేదములు పుట్టినట్టుచెప్పబడి యున్నది మఱియును నాయాఋషులపే ర్లతోనే యాయా శాఖలు నుపనిషత్తులు మొదలయినవి వ్యవహరిం ప బడుచున్నవి.

అయితే ఆఋషుల హృదయములలో దేవుడు ప్రేరేపించి చెప్పించిన వగుటచేత వేదము దైవప్రణీతమని కొందరు చెప్పుచు న్నారు అట్లయ్యెడు పక్షములో, అందరివేదము లేమి అన్నిగ్రం థము లేమి నాస్తికగ్రంథము లేమి దేవుడు ప్రేరేపించి చేయించేవి గానే యేర్పడును గనుక ఋషులే చెప్పినవి. ఋషులున్ను వారి వారికి దోచినట్టు తత్వములను భిన్నభిన్నములుగా జెప్పియున్నారు. ఇందుకు శ్రీభాగవత మందు ద్వితీయస్కంధములో బ్రహ్మ, నారదు నికి జెప్పినచోట ॥ శ్లో ॥ నాహం నయూయం యదృతాంగతిం విదు ర్నవామదేవః కిముతాపరే సురాః । యన్మాయయా మోహితబుద్ధ యస్త్విదం వినిర్మితం చాత్మసమం విచక్ష్మహే ॥ బ్రహ్మదేవుడు నారదుని గురించి చెప్పేది యీశ్లోకము అనగా నేనుగానిమీరుగాని వామదేవుడు కాని వాస్తవమైన సంగతిని తెలియగము మనకందరికి దెలియని యంశములు కడమ దేవతలకు దెలియదనుట కైముతికన్యా యసిద్ధము. అయితే, భగవంతుని మాయచేత మోహింప జేయబడిన

బుద్ధిగలవారమై వారివారిమనోనుగుణముగా నేర్పరచి చెప్పుచున్నాము. అనియుండుటచే వారివారి బుద్ధికి గోచరించినట్లు నానావిధములుగా జెప్పియున్నందున నిన్నివాదములకు హేతువగుచున్నది లేక దేవుని వల్లవిని తెలుసుకొని చెప్పిన వారైతే అన్నియు నేకరీతిగ నుండును అట్లులేవుగాన దేవుని వలన వినబడునది శ్రుతియనిచెప్పుట సరికాదు.

ఆమ్నాయమనగా పారంపర్యోపదేశముచేత బఠింపబడుచున్నదను అర్థము సరిగాదు. అన్నగా అనాదియనుట సరిగాదు. అట్లయితే దేవుని వంటి నిత్యముక్తావల్లనే వచ్చును. శబ్దము ఒకరి వలన జెప్పబడదగినదేను!

—(*) వేదాదులందు బరస్పర విరోధములు. (*)—

విప్రులవలన నేరింగి వాట్లకు అర్థములు వ్రాయుచున్నాను. ఎందువల్ల నంటే వేదములు శూద్రు లుచ్చరింప గూడదన్ని చెప్పెదరు. అందరికి తండ్రియగు దేవునిచే జెప్పబడినవైతే బిడ్డలమగు మనకందరకు బాధ్యత యుండును. ఇవి విప్రులు చెప్పినవి గాన, అమాటెపు ఒప్పుకొంటిని. వేదములలో నుండు పరస్పర విరోధములు కొలచె. ముగ వ్రాసెదను, ఛాందోగ్యోపనిషత్తులో నీప్రపంచమునకు మొదలు సత్తేయుండె ననియు, యజుర్వేదములో తైత్తిరీయోపనిషత్తులో నానందవల్లిలో ఈప్రపంచమును పూర్వము అసత్తుగా నుండెను, ఆయసత్తు వలన సత్తు పుట్టె ననియు నున్నది ఇట్టి ప్రకారము అనేక చోట్ల నున్నది. గాబట్టి, యాస్తిక నాస్తిక మతములకు వాదాంబు గలిగెను, ఇందువల్ల స్మృతికర్తలుగ నుండు, బృహస్పతి శ్లో॥

అగ్నిహోత్రం త్రయో వేదా స్త్రిదండం భస్మగుంఠనం । బుద్ధిపౌరుష హీనానాం జీవికేతి బృహస్పతిః ॥ అనిబృహస్పతిచార్వాకోక్తమత

మును, గౌతములు (ప్రబోధచంద్రోదయములోనిది)॥ శ్లో ॥ తుల్యే త్వేవ వపుషాం ముఖాద్యవ యవైః వర్ణక్రమః కీదృశః । స్త్రీ చేయం వసువా పరస్య యదముం భేదం నవిద్మోవయం ॥ హింసాయా మథ వా యథేష్ట గమనే స్త్రీణాం పరస్వగ్రహే । కార్యాకార్య కథా స్తథాపి యదమీ నిష్పౌరుషాః కుర్వతే ॥ అని యున్నది. అనగా శరీరముల ముఖాద్యవయవములచే నందఱకును సమత్వము గలిగియుండగా, బ్రాహ్మణాది జాతిక్రమము ఎక్కడిది ఇది పరునిస్త్రీ, ఇది పరునిధనము, అనునీ భేదమును మేమెఱుంగము. అట్లయ్యును, ఈనిష్పౌరుషులు హింసయందును, స్త్రీలను యథేష్టముగ బొందుటయందును, నొరుల సొత్తుల పుచ్చుకొనుటయందును, ఇది కార్యము. ఇది యకార్యము అను కథలను జేయుచున్నారు. అని, చైనాదేశములో బౌద్ధ మతమును కల్పించిరి.

అయితే యీబృహస్పతి గౌతములు వేరేయని కొందరుచెప్పెదరు. అది నమ్మతగినది కాదు ఏందువల్లనంటే, పాద్మోత్తరములో బృహస్పతి చార్వాకమతమును జేసినాడని యున్నది. మఱియునథార్థగా కర్మములవలన గొన్నిఫలములు గలుగుటను జూచి, కర్మమే ఫలమిచ్చు చున్నదని తలచి జైమిని కర్మబ్రహ్మమతమును గల్పించెను. ఇట్లనేకులు నాస్తికమతములను గల్పించిరి. అట్లు కర్మములే ఫలము నిచ్చునెడల దాసీ జావకుండ నైశ్వర్య వంతుడుగా తగిన కర్మములు చేసుకొని యెల్లప్పుడు బ్రతికియుండవచ్చును. మఱియును రాజులు సేనల గూర్చుకొని యుద్ధములు చేయకనే యాభిచారిక కర్మములు చేసిగాని మంత్రపూతములగు నారాయణ పాశుపత బ్రహ్మాస్త్రాదుల బ్రయోగించి గాని, శత్రువుల జంపవచ్చును, గావున కర్మమే ఫల మిచ్చుట యబద్ధము. ఎట్లనగా బూర్వము భారతాది

యుద్ధములలో ననేకులు నేకకాలములో నొకనిమీద బాణములు ప్రయోగించితే, అన్నిటిని ఏకకాలములో గొట్టినాడని యున్నదే అది వల్లపడునా, లేక అంత మంత్రశక్తి గలిగి దివ్యాస్త్ర వేదులైతే మహారాజులే పోట్లాడ వచ్చునే? సేనలనేల చంపుకొన వలెను. సేనల చేత నేమహారాజేని చంపబడినట్టు వ్రాయబడి యున్నదా? కాబట్టి యేరాజు సేనల వలన నెదటిరాజు చచ్చునో యాసేన గల రాజే చంపె నని వ్రాసియుందురు. లేకుంటే సేనతో బ్రయోజనమేమి, రథములు నిమ్నోన్నతములు గాను పీనుగులు అడ్డము పడియుండుచోట్ల నెట్లు నడుచును, ఇందు వల్ల అంబారీలలో నెక్కి చూచుచు నున్నట్టు మెత్తగా నురిడు రథాలలో నెక్కి రాజులు యుద్ధము చూచుచు నుందురు.

ఇందువల్ల కర్మమంత్రాస్త్రాదుల వలన బ్రయోజనము లేనట్టు గనుపడు చున్నది. మరియును రుషులయొక్క మంత్రాది శక్తుల వలన గొందరు చెవులు మొదలగు నింద్రియ గోళముల వలన బుట్టిరనియు, గొందఱు రుషులు అప్సరసలను జూచిన మాత్రముచేతనే, వీర్యస్ఖలనమై శునక శుకాదులకు జనించిరనియు, గొందఱు కుంభ స్తంభాదులల్లో బుట్టిరనియు గొప్పవదులు రుషుల కొఱ్ఱా గ్రైలనియు పర్వతాదులు శిష్యులనియు, మఱియు గాంధారి తన గర్భమును భిన్నము జేసుకొనగా, నాముద్దను, వ్యాసులు అనేక ఖండములుగా జేసి, వానిని అనేకులుగా బుట్టునటుల జేసె ననియు, జెప్పబడియున్నది.

ఇట్లెట్లు గలుగును, భూగోళఖండము, ననేక ఖండములుగా జేసినను, ఆత్మను ఖండించి యనేకాత్మలుగా నెట్లుచేయనగును. శ్రీ గీతలలో, ॥ శ్లో ॥ నైనంఛిందంతి శస్త్రాణి. అనియు, అచ్ఛేద్యము,

అదాహ్యము అనియు, జీవాత్మ స్వరూపము చెప్పబడి యున్నది. కాబట్టి ఆత్మను ఎట్లుఖండములుగా జేయనగును, ఇవి రుషులు తమ హెచ్చుకు జెప్పుకొన్న పిచ్చి ముచ్చటలు అని బుద్ధిమంతులు తలంచెదరు ఏలనంటే విజాతులయందు అచేతనములందు మనుష్యులుపుట్టుదురా?

—(*) {తత్వములు ఛందస్సులచేతను రుషులచేతను నానాప్రకారములుగ జెప్పబడియున్నవనుట.} (*)—

ఇందుకు భగవద్గీతలలో॥ శ్లో ॥ ఋషిభిర్బహుధాగీతం ఛందోభిర్వివిధైః పృథక్॥ అనియున్నది. అనగా బ్రహ్మస్వరూపము రుషులచేతను నానావిధములైన ఛందస్సులచేతనుబహుప్రకారములుగా చెప్పబడి యున్నది అని భావము. అయితే యిట్టి వేదశాస్త్రములలో నుండు వచనంబు లుదాహరణంబులుగా నేల వ్రాసితిరంటే॥శ్లో॥యుక్తియుక్తం వచో గ్రాహ్యం బాలాదపి శుకాదపి ॥ అనగా బాలుర మాటయినా చిలుక పలుకయినాయు క్తియుక్తమై యుంటే గ్రహించదగినదని భావము అని యున్నందున ననేకమతశాస్త్రాదులలో నుండు న్యాయ్యమైన సంగతులను గ్రహించి యివి, తెలుపుటకును వాసిలో బరస్పర విరోధము లున్నవనుటకును దృష్టాంతములుగ వ్రాసితిని వేదముల లో నుండు విరోధములు కొన్ని యిదివరకు వ్రాసియు నున్నాను ఇక క్రింద కొన్ని వ్రాయబోవుచు నున్నాను.

అయితే వేదాదులలో నుండు వచనంబులకు మీరు వ్రాసిన వాటికి అర్థము ఆలాగు కాదని చెప్పుదురు. ఈ వేదశాస్త్రాదులలో నుండు వచనంబులకే యాయా మతస్థులు అనేకార్థములను జెప్పియుండు నప్పుడు నేను జెప్పు నర్థంబేల్ల సరిగాక పోవును. పక్షపాతములేక చూడగా, నేను వ్రాయు నర్థమే సరి యైనదని తోచును,

ఋషులు కన్నులకు గనుపడు సప్తగ్రహములను అవి రాసులయందు దిరుగు వాట్లవాట్ల కాలభేదములను ఋజుగతి వక్రగతి స్తంభనముల నుగనిపెట్టి గణితములోకి దెచ్చుకొని గ్రంథములు వ్రాసిరి యిట్లు వ్రాయుటకు మనవలె గాకుండ బహుసంవత్సరములు బ్రతికియుండే వారుగా నుందురు దృశ్యములు గాని రాహు కేతువులను గ్రహముల లో జేర్చి యుండలేదా యని యంటే అవి గణితములో వచ్చే పాతలు అను సంజ్ఞలను రాహు కేతువులని చెప్పుతారనియు నవి గ్రహములు గావనియు జ్యోతిగణిత సిద్ధాంతములలోనే కొన్నింటిలో వ్రాసి యున్నారు యిందువల్లనే జాతకములను వ్రాయు రీతులు చెప్పియుం టే బృహజ్జాతకములో రాహు కేతువులకు ఫలములు వ్రాయవలసి నవి పనిలేదని వ్రాసియున్నారు. ఈఫల శాస్త్రములలోను వేరు వేరు విధములుగా ఫలములు వ్రాసియున్నారు.. ఇతర ఖండములలో జాత కగ్రంథములలో ఫలములు వేరువేరుగా వ్రాసియున్నారు. గాన నీఫ లశాస్త్రము సరియైనది కాదని వేయి సంవత్సరములనాడు వ్రాసిన ఫార్సీగ్రంథమును,ఇంగ్లీషుగా తర్జుమా చేసిన, ఆల్ బరూని అను గ్రంథములో వ్రాయబడి యున్నది- ఫలములును అనుభవమునకు సరి గా రావడము లేదు-

ఇందువలనే ఋషులు ప్రత్యక్షముగా గాని, యోగ జ్ఞానదృష్టు ల చేతగాని, తెలిసి చెప్పినవారుగారు, ఏలనంటె, ఉట్టికి యెక్కలేన మ్మ స్వర్గమునకు ఎక్కెకుక్క నను లోకోక్తిప్రకారముగ, నొకమయి లుదూరమునకు లోపలనుండు మేఘములు వర్షించు సంగతి యెం దులోను స్పష్టముగా జెప్పియుండ లేదు. ఇక్కడికి గనుపడు నుత్తర ధ్రువుని వ్రాసిరి గాని దక్షిణధ్రువుని ప్రస్తాపము వ్రాయలేదు.

ఇంతే గాక, అప్పుడు నళికాయంత్రము లేనందున రాసు

లందు దిరుగుచు నుండేవి యిప్పటికి గనుపెట్ట బడిన ౨౭౪ గ్రహములలో గన్నులకు గనుపడు ౭ గ్రహములు దప్ప తక్కిన గ్రహములనున్ను సూర్యునికి గల్గు శుక్రగ్రహణమునున్ను చంద్రుడు సూర్యునికి గ్రింద నుండుట చేత, సూర్యుని యొక్క దూరత్వ సమీపత్వముల వలన సూర్యకాంతి చంద్రుని యందు ప్రసరించి మనకు గాన వచ్చు వృద్ధిక్షయములను దశోపనిషత్తులలో జేరిన ఛాందోగ్యములో ౪ ప్రపాఠకములో చంద్రునికళలు కృష్ణపక్షములో దేవతలు క్రమముగా పానముచేసి తిరిగి శుక్లపక్షములో నిచ్చుచున్నారని వ్రాయబడియున్నది. ఇదియేమి పిచ్చిమాట్ల ఇవ్విధముగానే శుక్రుడును సూర్యునికి క్రిందనుండు గ్రహము గనుక దానికి సమీపత్వ దూరత్వములవలన గలుగు వృద్ధిక్షయములు నళికాయంత్రము చేత గానవచ్చునవి ఉత్త కన్నులకు గానరానందున, నవియును, శనిగ్రహము కన్నుగుడ్డు వలె నుండుటయు శని సంచారము వలన కొంచెము మాపులు గలుగుటయు, బృహస్పతిలో పట్టెలుండుటయు సూర్యునిలో చుక్కలుగలిగి తిరిగి మాయుటయు, కన్నుల కగుపడు ౨ గ్రహములు. ౧ యూరానస్, ౨ నెప్ట్యూన్, ఇవి శనికంటె చాలా ఆలస్యముగా సంచరించుట చేత వీనిని గనిపెట్ట జాలక పోయిరి. యూరానస్ ౮౪ సంవత్సరములకు, నెఫ్ట్యూన్ ౧౬౦ సంవత్సరములకు నొక్కచుట్టు ౧౨ రాసుల యందు దిరుగునవి గాబట్టి యీగ్రహముల మందగతి గనిపెట్టజాలక యువిగ్రహము లని వ్రాయలేదు. మరియు చంద్రునిలోనుండు పర్వతాదులవలె గనుపడునవి తెలియక కళంకమనుటయు నిట్టివి కనుపెట్టలేదు మరియు నెంతదూరముగ జంద్రుడు క్రిందుగా నక్షత్రములు మీదుగా నుండుట దెలియక దినము నొక్క నక్షత్రమునకు జంద్రుడు చూపునకు సరిగావచ్చునట్లు తెలియుట వలన ౨౭ నక్షత్రములు చంద్రునికి

భార్యలని వ్రాసిరి. ఇదియజుశ్శాఖ రెండవ అష్టము మూడవప్రశ్నము. ఐదవ అనువాకమున నున్నది. ఇందులోనే చంద్రుని కళంకము దక్ష ప్రజాపతి శాపనిమిత్తమని యున్నది. ఆనక్షత్రముల కన్నిగ్రహములు సరిగా వచ్చుచున్నవి గదా? యాగ్రహము లన్నియు చంద్రుని భార్యలను సంభోగించినట్లా? సూర్యునికి ఛాయయనగా నీడ, అది భార్యయనియు ఆమె సూర్యుని యుష్ణమును సహింప జాల్క నందున నామె తండ్రిసూర్యుని సానబట్టి కొంత యుష్ణమును తగ్గించినట్లును న్నది. రత్నమా సాన బట్టుటకు, దేహిని యెట్లు సానబట్ట వచ్చును? నీడయుష్ణమును సహించక పోవడమెట్లు? సూర్యుడు కదలు వాడు గాను ఒకగుఱ్ఱము ఒకచక్రముగల రథముగలవాడు గాను, తైత్తిరీయోపనిషత్తులో జెప్ప బడియున్నది.

ఇంతేగాక, సూర్యునియొద్ద యాజ్ఞవల్క్యరుషి వేదము చదువగా రథవేగము చేత అపస్వరములుగా నేర్పడితే, అదియొక శాఖగానుండుగాక యని వరమిచ్చి నట్టులున్నది. అదే శుక్ల యజుశ్శాఖ, సూర్యుడు కదలనివాడును, అథవా కదిలెబో, భూమిమీద బోవు రథమునకు వలె ఆకాశగమన రథమునకు నిమ్నోన్నతముల వలన గలుగు అదరుట, యెట్లు సంభవించును, ఈవిరోధము చూడుడు.

యజుర్వేదము ౭ అష్టము ౪ ప్రశ్నము ౨౦ అనువాకములో సూర్యునికి అనూరుడు సారథియని యున్నది. సూర్యుడొక్కడుగా నుండగా పన్నిద్దరు సూర్యులని బృహదారణ్యము ౫ అధ్యాయము, బ్రాహ్మణములో నున్నది. మఱియును గొప్పనక్షత్రములు రుషులని చెప్పుచున్నారు ఆరుషులు భూలోకమునకు వచ్చినట్టు వ్రాయబడి యున్నది, గదా ? అప్పుడు లెక్కలుండవా అత్రికి బుట్టక మునుపు చంద్రుడు లేడు గదా ? పాలసముద్రములో బుట్టిన చంద్రుడెవడు ? అత్రికి

బుట్టిన వాడెవడు? విష్ణుమనస్సులో బుట్టినవాడెవడు? శివుని తలమీద నుండు వాడెవడు? యోచించుడు. సూర్యచంద్రనక్షత్రములు భూగోళమువంటి పెద్దగోళములుగా నళికాయంత్రము వలన దెలియ వచ్చుచుండగా నవి దేవత లని వ్రాసిరి.

వారు ఇచ్చటనుండి యూహించి వ్రాసిన వారే యని బుద్ధిమంతులు తెలుసుకొన వచ్చును. మఱియు హృదయములో శ్వాస సంచి దాటి శ్వాసము ఎట్లు వెళ్లుటకును లేక యుండగా ఆశ్వాస మూలాధార చక్రము వఱకు పోవుచున్నదనియు, నిరోధింప బడిన యాశ్వాస దేహమందంతట వ్యాపించి అణిమాది సిద్ధులు గలిగించు ననియు శాస్త్రములలో వ్రాసిరి. మరియు శ్వాస నాళములోనే అన్నాదులు పోవుచున్నవని తలచి వస్తి ధౌతి చేయుమని వ్రాసిరి. కొంత ప్రత్యక్ష సిద్ధములుగా నుండు నిట్టి విషయములలోనే యింత పొరపాటుగా వ్రాసినపుడు ప్రత్యక్షసిద్ధములు కానివియు నగమ్యములైనవియు నగు దేవతలు ౧౪,లోకములు స్వర్గ నరకములు క్షీరేక్షు దధి ఘృతాది సప్త సముద్రములు సప్తద్వీపములు మహామేరు పర్వతము మొదలయినవి యున్నట్లు లెట్లు కనిపెట్టి వేదశాస్త్రములందు వ్రాసిరో యోచించుడు. పొగయోడలు యేర్పడిన వెనుక తెలియ వచ్చిన్నరిష్యా, యేష్యావి ఖండములు నచ్చట గంగకంటె దూరము ప్రవహించు నదులు అగ్ని కలిగి కరిగి ప్రవహించు పర్వతములు మొదలైన సంగతులు వ్రాయలేదు అవి తెలిసి యుంటే అచ్చటి నదులు కూడా ఋషుల కొమార్తె లని వ్రాసియుందురు.

అయితే యీ సముద్రము లవణముగా నుండుట చూచి విప్రులు క్షీరేక్షు దధి ఘృతాదుల రుచి తెలిసినవారు గనుక నాయా సముద్రములున్నట్లు ఆశచేత వ్రాసి యుందురు మరియు శ్రుతిస్మృతీతిహాస

పురాణములలో బరస్పర విరోధము లుండుటయే గాక యొక్కొక్క వానియందే పరస్పర విరోధములు గనుపడు చున్నవి యిందువలన మనము పుట్టక ముందు సంగతియు జచ్చిన వెనుక సంగతియు బిరోత్తు మందు జరుగుసంగతియు సృష్టిస్థితి ప్రళయంబుల క్రమంబును జీవులకు జన్మాంతర లోకాంతరములు గలవనుటయు స్వర్గ నరక బంధ మోక్షంబులును దత్వములస్వరూపంబును నెవ్వరికి తెలియదు. ఇందుకు ఋగ్వేదము ౧౦ వ యష్టకములో "సీసృష్టి యెక్కడ నుండి పుట్టినదో యెందుకొయినదో దీనిని ఎవడు నిశ్చయముగా గుర్తెరుగును ఎవడు నిశ్చయముగ జెప్పును. దేవతలు సృష్టి కీవలి వారలు కాబట్టి వారికి దెలియ దని" యున్నది. యజుర్వేదము బ్రాహ్మణము ౨ వ అష్టము ౮ వ ప్రశ్నము కడపటి అనువాక మందునున్నది.

ఇందులోనే దేవునికి గూడ తెలియ దని యున్నది. దేవుడ ఆ వేదములను జెప్పి గాని చెప్పించి గాని యుంటే. దానిలో ర ట్లుండునా? యోచించుడు. గావున పెట్టిన వారికే నిక్షేపము తెలిసి నన్నలోకోక్తి ప్రకారముగా సర్వ వ్యాపకుడు సర్వజ్ఞుడు సర్వశ క్తిమంతుడునై జగత్సృష్టి జేయుచుండు భగవంతునికే తెలియుచున్నద గాని యితరులకు దెలియదు ఏఋషుల పేరితో జెప్పబడి యున్నవో యాఋషుల నాడును ఆవేద శాస్త్రములు వారిచే జెప్పబడినవి గానున్న దోచలేదు.

—(*)స్మృత్యాదులు ఈవలి వారలు చెప్పిన వనుట.(*)—

ఎట్లనగా మనుస్మృతిలో స్త్రీలకు నియోగము గూడదని చెప్పుచోట వేనుని రాజ్యములో నియోగము జరిగె పశు ధర్మ మని నిషేధించినారని భూతార్థముగా జెప్పియున్నది స్వాయంభువ కాల మునకు ఈవల ననేక రాజులు గతించిరి పిమ్మట వేనుడు నృపుత్వము

జేసెను ఈవల సంగతి భూతార్థముగా మనుస్మృతిలో నెట్లు చెప్పం బడెనో తెలుసుకొనుండు. మరియు మనుస్మృతి, అ ౧, శ్లో ౬౧ "స్వాయంభువస్యాస్య మనో షడ్వంశ్యా మనవో పరే। సృష్టవంతః ప్రజా స్స్వాస్స్వామహాత్మానో మహౌజసః" అని, యున్నది.

అనగా ఈస్వాయంభువ మను వంశస్థులును, మహాత్ములును, మహాతేజస్కులు నగు నితర మనువులార్వురు తమతమ ప్రజలను సృజించిరి. అనిభావము.

ఇందు వలన భృగువు చెప్పినట్లుగాను దోచదు. ఆగురు మనువులు సృష్టించి రని భూతార్థముగా నున్నది గనుక ఈవలి వారు చెప్పినట్లు బుద్ధిమంతు లూహింతురు. ఇదియునుంగాక వాల్మీకి క్రౌంచమిథునమును జూచి నప్పుడు॥ శ్లో ॥ మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమ శ్శాశ్వతీ స్సమాః। యత్క్రౌంచ మిథునాదేక మవధీఃకామ మోహితం॥ అను నీశ్లోకము అవశాత్తుగా ఛందోబద్ధముగా వచ్చెను ఈశ్లోకముశోకంబున నితని వాక్కున వచ్చినందున శ్లోకమని పేరు వచ్చిన దనియు నంతకు ముందు శ్లోకకవిత్వము లేదనియు రామాయణము ఆదికావ్యమనియు బ్రసిద్ధమై యుండఁగా నంతకుముందే శ్లోకరూప స్మృతులెట్లు గలిగెనో యోచింపుడు స్మృతి యనఁగా మన స్సులోదోచునది యని చెప్పుచున్నారు. ప్రశ్నప్రతి వచనములు శ్లోకరూపముగా నెట్లుదోచును యోచించుడు.

—(※) వేదములనాదులు కావనుట. (※)—

మరియుఁను వేదము లనాదు లని చెప్పుచున్నారు అట్లనాదు లయ్యెడి పక్షమున దేవుని వలన జెప్పబడి నట్టును దేవునివలె నిత్యములునుం గావలసి వచ్చును, వాటికి లోబడి దేవుడు నడిపించుట వలన స్వతంత్రుడు గాకపోయెను.

మఱియును వానిలో మనువేది చెప్పెనో యదిపథ్యమని యజుర్వేదమునందు తైత్తిరీయారణ్యకములోను సామవేదములో ఛాందోగ్య బ్రాహ్మణము నందును భూతార్థముగాఁ జెప్ప బడియున్నది గాబట్టి అవి స్వాయంభువ మనువునకు నీవలి యాధునికులు చెప్పి నట్లును అందులో గొన్నిభాగములు మతస్థులు ప్రక్షిప్తములుగా జేర్చి నట్లును జెప్పవచ్చును.

ఇట్లుండగా, ఆర్యమతస్థాపకుడైన. దయానంద సరస్వతి వేదములలో మంత్రభాగమము దైవప్రోక్తమనియు, నదియే ప్రమాణమనియు వ్రాసినారు. మంత్రభాగము అనుష్ఠేయార్థ ప్రకాశకమేగాని తత్వప్రకాశకము గాదు. పైన వ్రాసిన హేతువుల చేత వేదమంతయు దైవప్రణీతము గాదని యేర్పడెను.

మఱియు, మంత్రభాగము, హింసా రూపక యజ్ఞాదులను ముఖ్యముగా జెప్పునది. దేవునికి హింస, ప్రియమగునా ఆమంత్రము లకు గొందఱు హింసా వ్యతిరిక్తముగా నర్థము చెప్పుచున్నారు, అది వారిశిష్యులు వినవలసినదేను వారుచెప్పునదియె సరియైతే మంత్రములతో జేరిన యజ్ఞాదులు ఆర్యులైన ఋష్యాదులు ఏలచేయుదురు. మహాపండితు లయినవారు అప్పటినుంచి యిప్పటి వరకు యేలచేస్తూ వచ్చెదరు.

—(✻) { సంస్కృత భాషలో నుండు వేదములేమి ఇతర భాషలలోనుండు వేదములేమి దేవుడు చెప్పినవి గాని పంపినవి గాని కావనుట. } (✻)—

ఇదియునుంగాక మఱికొందరు వారివారి వేదములు దేవుడు చెప్పినవనియుఁ బంపినవనియు ఋషుల యందావేశించి చెప్పించెననియు జెప్పుమాట యభిమాన పూర్వకముగా నున్నది దేవుడు చెప్పి

నది గాని పంపి నదిగాని సత్యమయ్యేనేని వానిలో బరస్పర విరోధములుగాను జగత్సృష్ట్యాది హేతు తత్వములు ధర్మాధర్మములు మొదలయినవి భిన్నభిన్నవిధములుగాను నుండునా ఇందుకు సృష్టి విషయములో మనవేదములో తైత్తిరీయములో ఆత్మనుండి ఆకాశము గలిగె ననియు ఛాందోగ్యములో అగ్న్యాదిగాను, ఐతరేయములో జలాదిగాను వేదముల యందు ఒకచోట పురుషాదిగాను, మరియొకచోట హిరణ్యగర్భాదిగాను, సృష్టి యైనట్టువున్నదే యేదినిజము, ఇట్లే కడమ మతవేదములలోను సృష్టి వేరేవేరే విధములుగా జెప్పబడియున్నది, ధర్మాధర్మములు భిన్నభిన్నములుగా నుండెను అందరికి తెలిసే యున్నది గదా ఇందువల్ల మతపక్షపాతములు గల పండితులు చెప్పినవేను.

ఖురానులో నుండు తప్పులు దయానంద సరస్వతీస్వామివారు వ్రాసిన సత్యార్థ ప్రకాశికలోను బైబిల్లోనుండు తప్పులు నేను రచించిన హిందూమత విరోధ భంజనిలోను వివరింప బడి యున్నవి చూడుడు.

అయితే, మన వేదశాస్త్రములలో నుండు సమష్టిభావము అద్వైతము. యెట్లనగా, ఈశ్వరుడు జగత్తుకు అభిన్న నిమిత్తోపాదాన కారణ రీత్యా అద్వైతము.

—(*) అందరి వేదాదులు దేవుడు చెప్పినవి గావనుటకు సూక్ష్మములుగా గను పెట్టదగిన విరోధములు. (*)—

సమస్తమయిన వారివారి వేదపురాణాదులలోని, రహస్యమయ్యున విరోధములు కనుపరచుచున్నాను. దేవునిచే జెప్పంబడిన వను వేదములలో దేవుని ప్రథమ పురుషముగా జెప్పుటయు, బురా

ణాదులలో ఋష్యాదివక్తలు, ఫలానావారికి జెప్పిరని పురాణవక్తలను ప్రథమపురుషముగా నందులోనే చెప్పియుండుటచే నితరులు ఎవరో చెప్పినట్లు స్పష్టమగుచున్నది. ఇన్నిటికిని నేకవాక్యత గాను లేనందున శబ్ద ప్రమాణ ములను తమతమ మతవేదాదు లట్లుండ నించు.

ఇందువలన "శాస్త్రయోనిత్వాత్" అనుసూత్రము సరియైనది గాదు, అది సరియైతే నాస్తికుల శాస్త్రములు కూడా ప్రమాణములు కావలసివచ్చును. అట్లుకాక మనవేదశాస్త్రములే ప్రమాణములనియు, స్త్రీశూద్రాదులకు మోక్షము లేదనియు, ఆర్యావర్తమే పుణ్యభూమి యనియు, విప్రులు వ్రాసిన వేదశాస్త్రములలో నున్నయది, ఇవి అతి పక్షపాతముతో జెప్పి పెట్టినమాటలుగా నున్నవి. ఇందుకు గీతలలో॥ శ్లో ॥ మాంహిపార్థ వ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనయః । స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేపియాంతి పరాంగతిం ॥ అని యున్నది. అనగా, పాపజాతులయినను ఎవ్వరు నన్నాశ్రయించి యుందురో, అట్టి స్త్రీ, వైశ్య, శూద్రులైను బరమగతిని బొందుచున్నారు. అని సర్వజనులకు మోక్షముగలదనిభావము.

ఇట్లుండు నపుడు, స్త్రీశూద్రులును అన్య ఖండములలో నుండువారును దేవునికి బిడ్డలుగా నుండునపుడు వారలకు మోక్షము లేదని చెప్పు నదియు ఆర్యావర్తభూమి పుణ్యభూమి యని చెప్పు నదియు దేవునికి పక్షపాతమును గలుగజేయు నదిగా నున్నది. గాన దేవునిచేత జెప్పబడినవి గావు.

మఱియు శంకరాచార్యులవారు శారీరక మీమాంస భాష్యములో ౧ వ అధ్యాయములో మొదటి పాదములో ఆరంభణాధికరణములో ౬ వ అధికరణమందు వేదములు మిథ్య యని వ్రాసినారు.

## —(*) మనస్సాక్షి గోచర సిద్ధాంతము. (*)—

జగ దనుమానాది ప్రమాణాదులచే గర్తయైన పరమాత్మ మనస్సాక్షికి గోచరించుచున్నాఁడు - నిత్యుఁడును - సర్వజ్ఞుడును - సర్వశక్తిమంతుఁడును - సర్వవ్యాపియు - సర్వకారణ కారణస్వరూపుండును సర్వేశ్వరుండును గాఁడేని యాభగవంతుఁడు ప్రపంచమును నిర్మింపఁజాలఁడు ఏలనంటే సాధారణమైన యొక చిత్రకార్యమును జేయుటకై శిల్పికి జ్ఞానమును శక్తియును గావలసినది, ఆవశ్యక మైనట్టు- చేతనాచేతన మిశ్రితమై పరిమితి లేని యనిత్యమయిన యీచిత్రవిచిత్ర ప్రపంచమును - ఎల్లప్పుడు నిర్మించుచు నుండుటకు, నిత్యతయును నాలోచించుటకు సర్వజ్ఞతయును, నట్లు చేయుటకు నుపకరణ సామగ్రి లేకయే కలిగించుటకు సర్వశక్తి స్వరూపత్వమును, సర్వప్రాణులకు నదృష్టానుసార ఫలముల నిచ్చుచు, దత్తజ్జీవ కర్మములను సాక్షిగా నెరుంగుటకు, సర్వవ్యాపకతయును, బ్రహ్మవిష్ణు రుద్రాదు లుండిరేని, వారిన్ని దదితర సమస్త చేతనాచేతనములనున్ను, గలిగించుటకును, వాట్లవాట్లకు దగిన బలముల నిచ్చుటకును, సర్వకారణ కారణత్వమును సర్వమును దననిర్ణయ ప్రకారముగ జరిపించుటకు సర్వేశ్వరత్వము నివిమొదలయినవి గలవాఁడేకాఁడేని జగత్కర్త కాఁజాలఁడు.

అయితే, ప్రపంచమునకు ఈశ్వరు లనేకులు ఏలయుండ గూడదని తోచును. ఒకఖండమునకు పెద్దలు రాజులుంటే యుద్దతితాత్పర్యభేదములచేత ననేకమార్పులు గలిగినట్లు ప్రపంచమునకు నూతన మార్పులు గలుగుట లేదుగాన నీశ్వరుఁడొక్కఁడే యని యెంచవలెను.

అయితే, దేవుడు సర్వజ్ఞుడను దానికి, జీవుడు స్వేచ్ఛతో జేయబోయెడు, నంశములు కూడా తెలిసి యుండువాఁడని కొందఱు అర్థము చెప్పుచున్నారు.

అట్లయ్యేనేని సమస్తజీవులకు ముందు జరగబోవు సంగతు లన్నియు నిర్ణీతములై యున్నయెడల, జీవు డెంతమాత్రము స్వతంత్రుడు కానందున, వీనికి బుణ్యాపాపములు లేకపోవలసి వచ్చును. మరియు విధిశాస్త్రములకు, బ్రయోజనమేమి, ఈయాజీవునికి,నీయాప్రకారముగ భవిష్యత్తు జరుగ వలసినదని యెట్లు, యేపఱడెను, వీనికి బూర్వజన్మకర్మఽవశముగా, నేపఱడిన దని యంటే, పూర్వజన్మ కర్మఽపొందును జీవుడికి స్వతంత్రత లేదే?

అయితే వారిజన్మ పరంపరగా వచ్చుచున్న దనియంటే, అట్లయినను ఆయా జీవునికి ఆదిసృష్టియందు, వీనికి నీచోచ్చజన్మములకు హేతువైన పూర్వకర్మ మెక్కడిది, దేవుడే నిర్ణయించెనంటే, దేవునికి వైషమ్యాదులు వచ్చును, గావున నీశ్వరుడు జీవులకు, గొన్ని కొన్ని కార్యము లందు స్వాతంత్ర్య మియ్యాగా నట్టి స్వాతంత్ర్యముచేత బుణ్యాపాప జనక కార్యములు చేయుట వలన నాజీవులకు, దేవుడు రక్షాశిక్షాదులు చేయుటకు నిమిత్తమగుచున్నది.

ఇందుకు, యాజ్ఞవల్క్య స్మృతి జీవోత్పత్తి ప్రకరణ మందు॥

శ్లో ॥ నిస్సరంతియథాలోహపిండాత్తప్తాత్స్ఫులింగకాః । సకాశాదాత్మన స్తద్వ దాత్మానః ప్రభవంతిహి । తత్రాత్మాహి స్వయంకించిత్కర్మకించిత్స్వభావతః । కరోతి కించి దభ్యాసా ద్ధర్మాధర్మోభయాత్మకం । నిమిత్తమక్షరః కర్తా బోద్ధాబ్రహ్మాగుణీవశీ । అజశ్శరీర గ్రహణాత్ స జాత ఇతకీర్త్యతే ॥ అనియున్నది - అట్లుజీవుని స్వాతంత్ర్యము మీద ముందు వాడు చేయబోవు, కార్యములందును, దత్ప్రయుక్త శిక్షారక్షణాదుల యందును భవితవ్య మీశ్వరునికి దెలియుటకు, న్యాయములేదు, ఇట్లయితేనే యీశ్వరునికి నిష్పక్షపాతత్వమును జీవునికి స్వతంత్రత వలనం జేయు కార్యములకు ఫలభోక్తృ

తయును, విధిశాస్త్రములకుబ్రయోజనంబును, సిద్ధించును. మరియును, నీశ్వరుడు తాను జేయు పనులు ముందుగ నెరింగియున్న యెడల నాప నులకు నొకక్లిష్ట మేర్పడ వలసి వచ్చును, అక్లిష్టి అనుచట్టము మరియొకరు గాని లేక, తాను గాని చేయ వలసి యున్నది ఆప టమునను గానరు వలెలోబడి నడువ వలసి వచ్చును, దాని వలన నద్దేవునికి పరాధీనత గాని లేక, తనమాయాశక్తికి బరిమితి గాని యేర్పడును - ఇట్లయ్యె నేని దేవుడు ఎప్పుడు ఎట్టుచేయవలెనం చే - అట్లు చేయుటకు వలను లేక యుండును - దేవుని దయ కు అవకాశము లేక యుండును. దేవుని సర్వశక్తికి - పర్యాప్తి యున్న గలుగును - దేవుని మాయాశక్తికి దుద లేదనియు దాని తుదను దేవుడెరుగడను నీశంకా పరిహారార్థమై భాగవతములో॥

శ్లో॥ నతోస్మ్యహం తచ్చరణం సమీయుషాం భవచ్ఛిదం స్వస్త్య యనంసుమంగళం। యోహ్యాత్మ మాయా విభవం నపర్యగాః యథా నభస్వంత మథా పరేకుతః॥ అని యున్నది అనగా నెవడైతే తన మాయాశక్తి పరిమితిని గుర్తెరుగడో - అట్టి భగవంతునికి - నమ స్కారము. అట్లైతే తన సర్వజ్ఞత్వమునకు లోపము రాదా యని యంటే - మాయాశక్తికి బరిమితియే లేనపుడు దాని తుద నెరుగు నను టకు - న్యాయము లేదు - ఎట్లనగా దుదిలేని యాకాశము తన తుది నెరుగదను - లోపము దానికి గలదా అట్లు సర్వజ్ఞతకు లోపము లేదని చెప్పి యున్నది - దీనవలన జీవుని యదృష్టానుసారముగా - వానికి జరుగబోవు ననిచ్ఛాదృష్ట విషయమందు మాత్రము భవితవ్యము భగవంతునికి - దెలిసి యుండును నేగాని జీవుడు తనకు దేవుడిచ్చిన స్వాతంత్ర్యముతో జేయబోవు కార్యముల విషయము గురించి భవి తవ్యము దేవునికి ముందుగా దెలియ వలసిన న్యాయము లేదు.

మరియును దేవుడు సర్వశక్తిగలవాడనుటకు, దానుజావవలె నంటే, దాను జచ్చునా అందువలన సర్వశక్తత్వమునకు లోపము రాదా యని యిట్లును గొందరందురు. అది సరిగాదు, ఎట్లనగా ఆకాశమునకునాశము కలదా, అవ్విధముగానే నిత్యపదార్థమెప్పటికి, నభావము కానేరదు. కాబట్టి యీయాక్షేపము సరిగాదు. దేవుడు సర్వవ్యాపకు డని చెప్పుతారే, కఠినమై యేమాత్రము అంతరవకాశము లేని వాట్లయందు లోపల నెట్లు వ్యాపించి యుంటాడని కొందఅందురు ఆకాశము సర్వత్ర వ్యాప్తముగా నుంటున్నదని, నైయాయిక సిద్ధాంతము, అట్లుండగా, కఠినమయిన వృక్షపాషాణాదుల యందు అంతటా వ్యాపించి వృద్ధి చేయుచు చైతన్య మెట్లున్నదో అదేరీతిగ బరమాత్మ కఠినమయిన వాట్లయందును వ్యాపించి యున్నాడు.

అయితే యిన్నిశక్తులుంటేనే గాని జగత్కర్త కాజాలడని చెప్పుచున్నారు గదా. ఇట్లు సర్వశక్తులు గలిగి పూర్ణుడుగా అవాప్త సమస్తకాముడుగా, సత్యజ్ఞానానంద స్వరూపుడుగా నుండు దేవుడు జగత్సృష్టి జేయుటకు గారణ మేమందురు. ఇందుకు విష్ణుపురాణమందున్న యుత్తరము॥ శ్లో ॥ శక్తయ స్సర్వభావానామచింత్య జ్ఞాన గోచరాః । యతోతో బ్రహ్మణ స్తాస్తు సర్గాద్యా భావ శక్తయః ॥ అనగా సర్వవస్తువులందు గల శక్తులెట్లు గలిగిన వని చింతించుటకు అశక్యములు.

అయితే ఆశక్తులు మాత్రము వాట్ల కార్యములవలనే మనజ్ఞానమునకు గోచరములుగ నున్నవి. ఇటులనే బ్రహ్మము ప్రపంచ మెందుకు జేసెనని చింతించుట కశక్యము.

అయితే సర్గాది కార్యముల వలను ఆయాసశక్తులు జ్ఞాన

గోచరము లగుచున్నవి కాబట్టిసృష్ట్యాదులు బ్రహ్మము యొక్క స్వభావమనియే చెప్పవలసి యున్నది ఇట్లయితే స్వభావమే కారణమని చెప్పునాత్మవాదుల సిద్ధాంతమే కాలేదా యని శంకింతురు అట్లు కాజాలదు ఏలనంటే జగదుత్పత్త్యాదులకు హేతువు జడవస్తువుయొక్క స్వభావమని వారు చెప్పెదరు అట్లయితే చేతనాచేతన మిశ్రితమయిన యీచిత్ర విచిత్ర ప్రపంచము జ్ఞానేచ్ఛాక్రియాశక్తులుగల దేవుడు చేయనిదే తనంతట కలుగ జాలదు గనుక యెగువ వ్రాసిన సర్వజ్ఞత్వాదులు గల బ్రహ్మము నంగీకరింపక విధిలేదు యీ విషయము అనాత్మ మత ఖండనను నందు జూడుడు.

—(*) మతస్థులు చెప్పే ప్రపంచ సృష్టి భేదములు. (*)—

మరియు ననేక మతస్థులు బ్రహ్మమే చిదచిద్రూపముగా బరిణమించె ననియు గొందరు చిదచిత్తులు వేరువేరుగా నుండె వానిని ప్రపంచముగా జేసె ననియు గొందరు భగవంతుని కంటె నన్యపదార్థము లేనందునను దాను నిర్వికారుడైనందునను నైంద్రజాలికుని వలె ప్రపంచమును గల్పించెననియు నింక ననేకవిధములుగాను చెప్పుచున్నారు. ఇందెయ్యది యథార్థ మయినను గాకున్నను భగవంతుడు పైజెప్పబడ్డ సర్వజ్ఞత్వాదులు గలవాడని మాత్రము అంగీకరింపక విధిలేదు.

అయితే కొందరు రూపము గలిగి పరిచ్ఛిన్నుడుగాను గృహభార్యాదులు గలవాడు గాను నుండి యాయాపనులు తాకలుగయున దేవతలచే జేయించు చున్నాడని యొకమహారాజ దృష్టాంతమును బట్టి చెప్పుదురు అది సరికాదు పరిచ్ఛిన్నునికి జ్ఞానశక్తు లపరిచ్ఛిన్నములుగా నుండ జాలవు అట్లు పరిచ్ఛిన్నులుగా నుండి పనులు జేయించు చక్రవర్తులరాజ్యమందు నవుకరులు పొరబాట్లు ప్రభువులు

తెలుసుకొనని కారణంబున నక్రమములు జరుగుచున్నవి గదా కా
బట్టి భగవంతుని బరిచ్ఛిన్నుడు గాని వాడనియే చెప్పవలయును,

—(*) అనుమాన ప్రమాణ సిద్ధ కారణ స్వరూపము. (*)—

అయితే అట్టివానిని మనము తెలియు రీతి యెట్లనగా ప్రత్య
క్ష గోచరమయిన యీజగత్తును జూచి యిందుకు గర్తాయైన స
ర్వకారణ కారణ స్వరూపు డున్నాడనియు మరియును సమస్తకార
ణ సామగ్రియుండియు బురుషుని యిష్టప్రకారముగ స్వల్పకార్యమైన
నొకప్పుడు సిద్ధింపక పోవుటయు నొకప్పుడు యత్నములేకనే గొప్ప
కార్యములు సిద్ధించుటయు బ్రత్యక్ష సిద్ధముగా నున్నది ఇందువల్ల
అదృష్టాను సారముగా సిద్ధ్యసిద్ధిరూప ఫలముల నిచ్చుట కట్టికర్త
యైన నాథుడొకడు సర్వత్ర యున్నాడనియు స్పష్టముగా మనస్సా
క్షికి దెలియ వచ్చుచుండగా బరిచ్ఛిన్నుడుగ దేవుడు ప్రత్యక్షము గా
వలెనని మూఢులు తపస్సు చేయుచున్నారు. ఇందుకు దబ్బిస్తానే మ
జాహెబ్బు అనుగ్రంథమునందు బయత్, "మాన ఆ నెఖుదేం ఆనితో
యేం, బేనిషానీతో మా, నిషానీతో యేం" అనియున్నది అనగా మేము మా
నొత్తులము గామునీ సొత్తులము నీవు గుణుతు లేనివాడవు మేము నీగుఱ్ఱులము
అనగా నీవు సమస్తమునకు కర్తవు సర్వశక్తులుగల పూర్ణుడవు రూపము
లేనివాడవు నీకార్యమైన ప్రపంచంబును, జీవాదృష్టానుసారముగా నీచేత
జరిపింప బడు కార్యంబును నీవున్నావనుటకు గుఱ్ఱులు అనిభావము.

—(*) సర్వకారణ కారణస్వరూపోపాసన. (*)—

అట్టినాథునితో జీవుడు అభిన్నుడే గాని విశేషణమే గానీ భిన్ను
డే గాని యాదేవుని యొక్క పరాపర ప్రకృతులలో బరప్రకృతియే
గాని ప్రకృతియనగా దేవుని స్వభావము అందువలననే స్వభావము
నకు బ్రకృతియని పేరు పరప్రకృతి యనగా నుత్కృష్టమయిన ప్రకృతి

అదేచిత్తు అపర ప్రకృతి యనగా అపకృష్టమైన ప్రకృతి అదే య చిత్తు యీచిదచిత్తులు దేవుని స్వభావమగుట వలననే ఆయనకు మరి యొక కారణము ఉండవలసినట్టు లేపడదు ఇదిగాక ఈజీవుని స్వరూపము మరి యేవిధముగా నుండినను వాడు తనకేది పరమమైన శ్రేయస్సో దానిని ఆసర్వేశ్వరుని దయవల్లనే పొంద వలసి యు న్నది గావున ఆయనయొక్క ఇతర సాధారణములు గాని జగన్నా థా ద్యసాధారణ నామములతో స్మరణ రూపకోపాసన జేయుట యే సరియగును.

అంతే మరికొందరు ౨౪ తత్త్వములలోనే దేహ స్వరూ ప నిరూపణమై కార్యకార్యణ కర్తృత్వాదులు ప్రకృతికార్యమనియు వీనితో సంబంధము మనః కార్యమనియు వీనికి విలక్షణుడైన వాడే ఆత్మయనియు దెలియుట యను తత్త్వజ్ఞానము వలననే ఆత్మకు బు ణ్యాపాప సంబంధములు తొలగి మోక్షము గలుగు చున్నదని చెప్పు చున్నారు. జాగ్రత్స్వప్న సుషుప్తులను బట్టిచూడగా నది సరియైన దేను ఎట్లనగా ఆత్మతో సంబంధించిన మనస్సు బహిర్ముఖమైతే జాగ్రత్తయును అంతర్ముఖముగా నుంటే స్వప్నంబును గల్గుచున్నది సుషుప్తియందు ఆత్మకు మనస్సంబంధము లేనందున నేవ్యత్తులు గలు గవుగదా అందువల్ల సర్వమునకు మనస్సేకారణము ఇందుకు విష్ణు పురాణములో॥ శ్లో ॥ తస్మాద్దుఃఖాత్మకం నాస్తి నచ కించి త్సుఖా త్మకం । మనసః పరిణామోయం సుఖదుఃఖాది లక్షణః ॥" అనియు న్నది.అనగా,దుఃఖరూపమైన వస్తువు కొంచెమును లేదు. సుఖరూప మైనది కొంచెమునులేదు కావున నిది, సుఖదుఃఖాదిలక్షణమైన మనః పరిణామము. అని భావము.

అతే ఆత్మకు దనవిగాని ధర్మములను దన వని తలచుట

మేవని మాయవల్ల గలుగుచున్నదో ఆ[illegible] ద్దయరానిదే ఆమాయ
నతిక్రమించుటకు సాధ్యముకాదు ఇందుకు గీ[illegible] దైవీహ్యే
షా గుణమయీ మమమాయా దురత్యయా। మామేవయే ప్రపద్యంతే
మాయా మేతాం తరంతితే॥ అనగా సత్వ రజ స్తమాత్మక గుణ
మయ మయిన నామాయ తప్పించుకొన తగినది కాదు నన్నే ప్రపత్తి
చేయువారు ఈమాయను దాటుచున్నారు అని యున్నదిఇందువల్లనే
అద్వైవాదుల మత ప్రవర్తకులైన శంకరాచార్యులవారును ॥ శ్లో ॥
భజగోవిందం భజగోవిందం భజగోవిందం మూఢ మతే। సంప్రాప్తే
సన్నిహితే కాలే నహి నహి రక్షతి డుకృఞ్ కరణే ॥ అని చెప్పి
యున్నారు అనగా దేహాపాయ కాలము సంభవించినపుడు డుకృఞ్
కరణే అన్నునది నిన్ను రక్షింప జాలదు గనుక యీ మూఢ బుద్ధిని
మాని గోవింద భజన సేయుమనియు ॥ శ్లో ॥ నామస్మరణా ద
న్యోపాయం నహి పశ్యామో భవతరణే, అనగా భవార్ణవము
దాటుటకు నామస్మరణ కంటె వేరు ఉపాయమును గుత్తెరుగ
మనియు జెప్పియున్నారు యజుర్వేదము ౩౨ వ అధ్యాయమందు
"భగవంతునికి రూపములేదు ఆయనకు నామము మాత్రము ఉన్నది
అందు వలన నామస్మరణ చేయుట ముఖ్యము" అనియున్నది ఋగ్
వేదములో ౧ వ అష్టకములో "మోక్షమును జెందినవారిలో నెన్నవ
వాడ నగుదునో మనోజ్ఞమైన దేవుని నామమును మననము జేయు
చున్నానవనియు" జెప్పబడి యున్నది గీతలలో॥ శ్లో॥ సంతతం కీర్తయ
యంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః। నమస్యంతశ్చమాంభక్త్యా
నిత్యయుక్తా ఉపాసతే॥ అనియున్నది. అనగా, భక్తులగు వారలు
నన్నెల్లప్పుడును గీర్తించుచు విడువక యత్నించుచు, దృఢవ్రతులై
భక్తితో నన్ను నమస్కరించుచు, నెప్పుడును చలనములేని వార్లై.

నన్నుపాసింతురు. అనిభావము.

మఱియు ఋగ్వేదము ౨ అష్టకము. ౨ అధ్యాయము ౨౪ పనసలోనున్న ౮ అధ్యాయం ౧౬ పనసలోనున్న ౫ అష్టకం ౬ అధ్యాయము ౨౬ పనసలోనున్న యజుర్వేదం ౨ అష్టం ౩ ప న్నం ౬౭ పనసలోనున్న పరాయితం ౨ అష్టం ౮ పన్నం ౨౫ పనసలోనున్న, భగవన్నామ మహిమ చెప్పబడి యున్నదని భగవ న్నామామృత సుధోదయ మను గ్రంథములో వ్రాసి యున్నది.

ఇందువల్ల దేవుని దయరానిదే ఆయన మాయ నతిక్రమించుటకు సాధ్యము కాదు కాబట్టి అనన్య గతికముగా దృఢవిశ్వాసముతో సర్వ దా భగవంతుని స్మరణ రూపకోపాసన జేయవలెయును ఇందుకు జపమాలాధారణము ముఖ్యము ఈయభ్యాస దార్ఢ్యము వలన మన స్సులో నామస్మరణ గల్గుటకును మనస్సు కార్యాంత రాసక్త మైన ను తిరుగా జ్ఞాపకము జేయుటకును ముఖ్యమైనది ఇందువల్ల జప మాలికకు స్మరణియనిపేరు, నామస్మరణ విషయములో క్రీస్తులు అనవరతము దేవుడి నామము కీర్తించితే ప్రయోజనము లేదని చెప్పు తారు, వారి బైబిల్ గ్రంథములోను, యోహాను ౧౮ పర్వం ౧౩ - ౧౮ వచనములలో, క్రీస్తు తననామ కీర్తనము సేయుమని చెప్పియు న్నాడు, ఈవిషయము నేను జెప్పిన, హిందూమత విరోధ భంజని యను గ్రంథములో విపులముగా వ్రాసి యున్నాను, దానిలో చూ డుడు.

—(*) విషయాదు లనుభవించుచునే భగ వంతు నుపాసింప వచ్చు ననుట. (*)—

సరే ఇతే యీషణ త్రయాదులను వదలి యుపాసించ వలె నని కొందరు చెప్పుచున్నారు అది సరికాదు, ఏలనన్నగా, ధమా

ర్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థములు మనుజులకు ముఖ్యములైనవని బహుజనులు ఒప్పుకొని యున్నారు, అందులో కామ మోక్షములు ఐహికాముష్మికము లందు క్రమముగా సాక్షాత్తు సుఖరూపముగా ననుభవమునకు వచ్చునవి, కడమ రెండు పురుషార్థములు, అర్థము కామమునకు, ధర్మము మోక్షమునకు సాధనము లైనవి కాబట్టి సుఖరూపక కామ మోక్షములే, సాక్షాత్పురుషార్థములు, ఇవి మనుజులకు ఆవశ్యకమై సాక్షాత్తుగా సాధింపదగినవి.

మఱియును విషయములను జీవుల యుపయోగముకొరకే దేవుడు సృజించి నందున వాటిని బరిత్యజించుట యసాధ్యము. ఇందుకు భగవద్గీతలలో ॥ శ్లో ॥ యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః । ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ అనగా నింద్రియ జయమునకు యత్నించు చున్న మహాత్ముల మనస్సును గూడా అతని స్వాధీనము కాకుండా చేసి ఇంద్రియములు విషయాసక్తములుగా జేయు చున్నవని భావము ॥ మనుః ॥ శ్లో ॥ మాత్రా స్వస్రా దుహిత్రా వా నైకత్ర సహాసనం వసేత్ । బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి ॥ అని యున్నది. అనగా తల్లితోడగాని తోబుట్టువుతోడగాని, కొమార్తెతోడగాని, ఏకశయ్యయందుబరుండరాదు. ఏలనంటే! ఇంద్రియ సమూహము, బలిష్ఠము, పండితుని గూడ నాకర్షించును. అనిభావము. గాన సద్విషయంబు లైన యీషణత్రయమును వర్జించుట సాధ్యము కాదు.

మఱియు నట్లు పరిత్యజించుట దేవుడు సృజించిన ప్రపంచమును క్షీణింప జేసి నట్లగును, గావున దేవుని కప్రీతియు గలుగును. ఇందుకు భగవద్గీతలలో ॥ శ్లో ॥ ధర్మావిరుద్ధో భూతేషు కామో

స్మి భరతర్షభ, అనగా భూతముల యందు ధర్మమునకు విరోధ ముకాని కామము నేను అనియున్నది గావున గృహస్థాశ్రమ మందుండి పుత్రాది వృద్ధిచేయుచు న్యాయముగా ధనార్జనము చేయుచు, అతి థుల్కు కన్నాదులిచ్చుచు నన్యాయ్యములై ఇతరులకు దుఃఖ జనకము లైన దుర్విషయము లందు ప్రవేశింపక మితముగా విషయాదు లనుభ వించ వచ్చును. ఇందు వలననే నీతిశాస్త్రములలో మితియను నీతికి మించిన నీతి లేదని చెప్పబడియున్నది.

అయితే మునులు అరణ్యాదులలో నుండి మౌనమునువహించి తపస్సు ఏల చేయుదు రనియందురు. ఇందుకు ॥ శ్లో ॥ మౌనాన్నము నిర్భవతి నారణ్యే వసనాన్మునిః । సల్లక్షణంతు యోవేత్తా సమునిశ్రే ష్ఠ ఉచ్యతే ॥ అనియున్నది, అనగా మౌనధారణముచేత మునికాడు. అరణ్యములో వసించుట వలన మునికాడు. ఇకనేమంటే ? సత్, అనగా, బ్రహ్మము అట్టి బ్రహ్మమును లక్షణ యుక్తముగా నెవడు తెలుసు కొంటున్నాడో ఆముని శ్రేష్ఠమైన వాడని చెప్పబడుచున్నా ము. అనియున్నది ఇంతేగాక, కామిగాక మోక్ష గామిగాడు, అని లోకోక్తి, ఇందుకు పద్యము॥ (గీ) ఇహము విడువ మేలు నింపుగాగల దని । మ్రహీని బలుకు వారి మతము కల్ల । ఇహముల్లోన బరము నె రుగుట కానర్గో । విశ్వదాభిరామ వినుర వేమ ॥ అనియున్నది గాన యీషణత్రయాదులను వర్జించ నక్కరలేదు, అట్లు విడుచుట వలన మోక్షము గలుగు నెడల మరణమొందెదు బాలోన్మత్తాదులకును, వృక్షపాషాణాదులకును, నీషణత్రయాదులు లేవుగనుక మోక్షము గ లుగవలసి వచ్చును. జ్ఞానము వలన మోక్షము గలుగవలె నంటే, అని షిద్ధమైన యీషణత్రయములు వర్జించుట మేల గావున సద్విషయా దుల ననుభవించుచు భగవ దసాధారణనామస్మరణ రూపకోపాసన

చేయుటయే సరియగును. ఇందువలననే గీతలలో ॥ శ్లో ॥ యజ్ఞానాం జపయజ్ఞోస్మి, అనగా యజ్ఞములలో నేను జపయజ్ఞమని భగవద్వాక్యము, జపయజ్ఞము, అగ్నిష్టోమాదుల వలెనే హింసతో జేరినది గాదు. ఇందుకు భాగవతములో ౩స్కంధములో దేవహూతి కపిలుని స్తుతించు చోట॥ శ్లో॥ అహోబత శ్వపచోతో గరీయాన్, యజ్జిహ్వాగ్రే వర్తతేనామతుభ్యం। తేపుస్తపస్తే జుహువు స్సస్నురార్యా । బ్రహ్మానూచుర్నామగృణంతి యేతే॥ అనియున్నది. అనగా, నత్యాశ్చర్యము. ఏమనగా, ఎవని జిహ్వాగ్రమందు నీనామముకీర్తింప బడుచున్నదో వాడుకుక్కను దిను, చండాలుడైనను, వాడే గొప్పవాడు, వాడే తపస్సుచేసినవాడు, వాడే యజ్ఞము చేసినవాడు వాడే సర్వతీర్థములలో స్నానముచేసిన వాడు, వాడే సదాచారసంపన్నుడైన యార్యుడు వాడే వేదాధ్యయనము చేసిన వాడు అని చెప్పఁడియున్నది. కడమ యజ్ఞముల కంటె నామజపయజ్ఞము, శ్రేష్ఠమని భావము॥

—(*) { సర్వకాల సర్వదేశములయందును భగవంతుని గీర్తింపవచ్చుననుట. } (*)—

ఈయుపాసన కాచారాదులు పనిలేదు, యేలనంటే నీచోచ్చ సర్వవస్తు రూపక ప్రపంచమందున్ను, సర్వదేశ సర్వకాలముల యందును, బరిపూర్ణుడై వ్యాపించి యుండు వాడు గనుక నట్టి యాయనను స్మరించుటకు నాచారాదులు పనిలేదు ॥ ఇందుకు ॥ శ్లో॥ రత్యంతరే మూత్ర పురీషయోర్వా చండాలవేశ్మ న్యథవా శ్మశానే । కృతప్రయత్నో హ్యకృత ప్రయత్న స్సదాస్మరేత్కేశవ నామధేయం ॥ అనగా, రతిమధ్య కాలమందు గాని, మూత్రపురీషోత్సర్గకాలములయందు గాని చండాల గృహమందు గాని శ్మశాన

మంచుగాని యత్నపూర్వకముగా గాని అయత్నపూర్వకముగా గాని భగవన్నామము స్మరింప వలయును. అనగా బుద్ధి పూర్వకముగా భగవన్నామ స్మరణ చేయుటకు కూడా దేశకాలాది పారిశుద్ధ్యము అనావశ్యకము లని భావము. ఇట్లు స్మృతిలో నున్నది.

మరియు వైశ్వానర స్మృతిలో॥ శ్లో ॥ నో దేశకాల నియమ శ్శౌచాశౌచ వినిర్ణయః । పరం సంకీర్తనా దేవ రామరామేతి ముచ్యతే॥ అనియున్నది. అనగా, దేశకాల నియమములేదు. శౌచాశౌచ నియమంబును లేదు. రామరామయని కీర్తించుట మాత్రముచేతనే ముక్తుడగుచున్నాడు. అనిభావము.

ఇందుకు ద్రౌపది రజస్వలగా నుండి స్మరించగా ఫలముపుట్టుటయే నిదర్శనము. అట్టి యసాధారణ నామఘటిత సర్వేశ్వరస్తోత్రమును, జగన్నాథస్తోత్రమును ఉపోద్ఘాతస్తోత్రపూర్వకముగా నాయభిప్రాయాను సారముగా మా వేంకటగిరి సంస్థానాస్థాన పండితులచే జెప్పించినారము. ఈస్తోత్రరూపక శ్లోకములను బఠించుటకు ఆచార నియమాదులు కోరెనేని, సాధనాంతరాపేక్ష గలవాడగును.

మరియు బతితపావనుని గీర్తించుటకు శుచిత్వమును గోరుట వలన అశుచిగా గీర్తించితే గలుగు లోపమును బోగొట్టు నట్టి శక్తి యాయనకు లేనట్లగును, గావున నేనియమాదులు పనిలేదు.

అయితే, శాస్త్రోక్త నియమాచారాదులు కూడా పనిలేదా యనియంటే పనిలేదని గీతలలో ॥ వృష్ణీనాం వాసుదేవోస్మి ॥ అని యుండే భగవద్విభూతి స్వరూపుడై జగదాచార్యులైన కృష్ణులు తన యందు విభూతిత్వేన ఉండు పరమాత్మతను బట్టి భాగవతములో॥ శ్లో ॥ తస్మాత్త్వముద్ధవోత్సృజ్య, చోదనాం ప్రతిచోదనాం । ప్రవృత్తించ నివృత్తించ శ్రోతవ్యం శ్రుతమేవచ ॥ మామేక మేవ శరణ

మాత్మానం సర్వదేహినాం। యాహి సర్వాత్మ భావేన మయాస్యాత్వ కుతోభయం ॥ అనగా, సాభజన ప్రభావము పైవివరింప బడిన ప్రకారముగ సర్వోత్కృష్టమైనది గనుక ఓయుద్ధవా నీవు శ్రుతులనున్ను స్మృతులనున్ను ప్రవృత్తి నివృత్తులనున్ను ఇదివరలో వినబడిన వాట్లనున్ను ఇకను వినదగిన వాట్లనున్ను విడిచి దేహవంతులకందరికి, ఆత్మయగు నన్ను. నొక్కడినే సర్వజనదాత్మ భావితుడను భావముతో శరణు పొందుము నేను ఉండగా నీకు భయమెక్కడిది అనగా నేను రక్షించుచున్నాను అని భావము. అనియును గీతలలో ॥ శ్లో ॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ। అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥ అనగా సర్వధర్మములను విడిచి నన్నొక్కడినే శరణు పొందుము నేను నిన్ను సర్వపాపముల నుండి విడిపించుచున్నాను అనగా సమస్త బంధముల నుండి తరింప జేయుచున్నాను అనిభావము. అని యుపదేశించినది గావున శాస్త్రోక్తాచారాదులు కోరినను శరణాగతికి విరోధమున్ను అందు వలన గలుగు భగవదప్రీతి నిమిత్తముగా ప్రత్యవాయమును గల్గును.

మరియును దేహములో మలమూత్రాదు లుండగా బాహ్యస్నానాదులచేత పవిత్రతయెట్లు గలుగుచు. ఇందువలన శౌచాచార వ్రతాదులు బాహ్యమలశుద్ధికి ఆరోగ్యాదులకు అసహ్యానివృత్తికి చెప్ప బడినవని బుద్ధిమంతులు కనిపెట్టియు న్నారు. అట్లు కానిచో చండాలాది కృత గుడ లవణాదుల కెట్లు దోషములేదు. భోజనాది సమయములలో పరస్పరోచ్ఛిష్టముల యందు వ్రేలు మక్షికముల వలనను, ఆజ్యతక్రాది ధారా సంబంధము వలనను గలుగు నుచ్ఛిష్ట దోషము లేల లేకపోవును. అశక్యును లైన వానికి దోషము లేదని

చెప్పుచున్నారు. ఇందుకు॥ గీ॥ కడుపులోని రోతకడుపు నోటి యెంగిలి। కడుఁగవశమె బ్రహ్మకొడుకుకైన । సత్యమున్న గొంత జగతిపైసిద్ధిం చు । విశ్వదాభిరామ వినురవేమ ॥ అనియున్నది.

మరియును, శుక్లశోణితములకు గలిగిన దేహమే యపరిశుద్ధ మైనది గావున శౌచాచారాదులచే బారిశుద్ధ్యమెట్లు గలుగును, కా బట్టి జగన్నాథుని స్తుతించుట గాని జపించుట గాని ముఖ్యము, శౌచా చారాదులు పనిలేదు.

మరియును, నామస్మరణ చేయుట.యందు హేజగన్నాథయని కీర్తింపవలెనని శాస్త్రములలో వ్రాసినారు, వైకుంఠ కైలాసాదు లలో నెక్కడనో భగవంతుడున్నాడని యోచించుకొని దూరస్థునిం బిలిచినట్లు, కీర్తింపవలెనను నభిప్రాయముతో చెప్పినారు. అట్ల య్యెనేని భగవంతునికి బరిపూర్ణత లేనట్లు లేపడును గాబట్టి నా మమాత్ర ముచ్చరింపవలయును. నామోచ్చారణ యెందుకు భగవం తుని మనసా.స్మరించితే చాలునే యని యందురు. భగవంతునికి బరి చ్ఛిన్నత గాని రూపము గాని లేని హేతువుచే గుణక్రియా ప్రతిపా దక నామ కీర్తన చేతనే స్మర్తవ్యుడు గాని ఇతర విధముగా నుపా సింప దగినవాడు గాడు.

మరియును భగవద్విషయక మంత్రములలో మొదట ప్రణవ మును జెప్పి చతుర్థ్యంతముగా ఓం నమో నారాయణాయ యని చెప్ప వలయు నన్ని చెప్పబడి యున్నది ప్రణవమునకు అర్థమేమని యంటే భగవంతుడని చెప్పుచున్నారు. ప్రణవము భగవద్వాచి యైతే నారాయణ నామముతో బ్రయోజన మేమి ఇంతేగాక ఇతర దేవతా మంత్రముల యొక్కయాది యందు బ్రణవము చెప్పబడి యున్నది గావున ఆప్రణవము యోచింపగా మంత్రము మొదల

ప్రణవ మేఁడుట వలన నారాయణ దేవతా పునశ్చరణకు బలము నిచ్చు బీజాక్షరముగా నుండునట్టు లేర్పడుచున్నది. భగవంతునిగోరించు వానికి భగవద్విషయక దృఢవిశ్వాసమే సిద్ధి గలిగించు నదిగా నుండగా ప్రణవము వలన నేమి యగును గాబట్టి ప్రణవముతో ప్రయోజనము లేదు. దృఢ విశ్వాసములో, జేరిన ప్రపత్తి విషయమై కవికర్ణ రసాయనములో పద్యము ॥ క ॥ ఒకడు భగవంతు డెల్లుగ । సకలేష్ట విధాయి యట్లు చరించంపగదా । నొక్కటి యగు దత్ప్రపత్తియు ।। సకలార్థ సమీహితార్థ సాధన మనఘా ॥అని, చెప్పబడియున్నది, యిది సరియైనది.

మఱియును, చతుర్థ్యంతముగా జెప్పుట జగత్తుకు గారణము లైన యనేక దేవత లున్నట్లును వారియొక్క వ్యావృత్తిని జెప్పునదిగా నున్నది. ఎట్లనగా నారాయణుని కొఱకు నమస్కారమని చెప్పుటలో. శివుని కొఱకు గాదని యర్థమగు చున్నది. ఈలాగే శైవులము వైష్ణవులము అని చెప్పుకొనుట వలన నిట్లనె అర్థమయి కారణాంతరము లున్నట్లు తామే యొప్పుకొన్నట్టు లగు చున్నది. ఆపక్షమందు నేకు లీశ్వరు లున్నట్టు లేర్పడి జగత్కారణ మొక్కడే యనుటకు భంగము గలుగును గావున చతుర్థ్యంతముగా నుచ్చరించుట సరి గాదు. అరిగన్యాయ కరన్యాసాదులు ఛాందసములు అనగా షిచ్చిసంగతులు.

మఱియు, నామమునకు మొదల శ్రీకారమ్మును జేర్చితే సర్వ పత్ప్రద మని చెప్పుచున్నారు ఆపక్షములో సర్వశక్తి గల భగవంతుడు సంపద నివ్వ లేనట్టగును. అప్పటికి శ్రీయను నక్షరమూ యిప్పించుచున్నది ఇక కేవలనగా నితర సాధారణములు గాని భగవన్నామములు మాత్రము కీర్తించుట ఆయన యందు మతి గలుగుటకు

ముఖ్యము. భగవన్నామ జపమును గురించి మహాభారత మందు ॥
శ్లో॥జపస్తు సర్వధర్మేభ్యః పరమో ధర్మ ఉచ్యతే। అహింసయాచ భూతానాం జపయజ్ఞః ప్రవర్తతే॥అనియున్నది.అనగా,జపముసర్వ ధర్మముల కంటె నుత్కృష్ట ధర్మమని చెప్ప బడుచున్నది, భూత హింస లేకనే యీజపమనే యజ్ఞము జరిపింప బడుచున్నది అని భావము.

మనుస్మృతి రెండవ అధ్యాయములో॥ శ్లో ॥ విధియజ్ఞా జ్జప యజ్ఞో విశిష్టో దశభి ర్గుణైః ।, ఉపాంశు స్స్యాచ్ఛతగుణ స్సాహ స్రో మానస స్స్మృతః ॥ యేపాకయజ్ఞా శ్చత్వారో విధియజ్ఞ స మన్వితాః । సర్వేతే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీం ॥ జ ప్యేనైవతు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః । కుర్యాద న్యం నవా కుర్యాన్ మైత్రో బ్రాహ్మణఉచ్యతే॥ అనియున్నది. అనగా శ్రుతివిహితంబులగు అగ్నిష్టోమాదియజ్ఞములకంటెజపమనేడుయజ్ఞము పదింతలు హెచ్చయినది. యీజపమే ఉపాంశు వనగా నితరులకు వినబడకుండ నుచ్చారణతో జేయబడెనేని నూరింతలు హెచ్చైనది. ఉచ్చారణ లేక మానసముగా జేయబడెనేని వేయింతలు హెచ్చైనది. అగ్నిష్టోమాది యజ్ఞములున్నూ నాలుగైన పాక యజ్ఞములు న్నూ ఇవిఅన్నియుచేరినను జపయజ్ఞము యొక్క పదియారవ పాలికి సరిపోల్చ బడదు, బ్రాహ్మణుడు జపమువల్లనే సిద్ధిబొందు ననుట సం దేహములేదు, జపముకంటె వేరే చేసినా చేయకపోయినా యీజ పము సేయు బ్రాహ్మణుడు భగవంతునితో మిత్రతను బొందినవాడని చెప్ప బడుచున్నాడు. ఎట్లనగా హింసాకరములగుయజ్ఞాదులనుమాని నందున సమస్తభూతములకు మిత్రుడుగా నుండుట వలన భగవం తుడు వానిని మిత్రునిగా జేసుకొనుచున్నాడని భావము.

బ్రాహ్మణత్వ నిరూపణ విషయము వజ్రసూచ్యుపనిషత్తులో బ్రహ్మజ్ఞానము గలవాడే బ్రాహ్మణు డని వివరముగానున్నది యిందుకు మరియొక ॥ శ్లో ॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః । వేదపాఠాత్తు విప్రస్స్యాత్ బ్రహ్మజ్ఞానాత్తు బ్రాహ్మణః॥ అని యున్నది.

అనగా, జన్మముచేత శూద్రుడగును, ఉపనయనకర్మము చేత ద్విజుడగును, వేదాధ్యయనముచేత విప్రుడగును, బ్రహ్మజ్ఞానంబు వలన బ్రాహ్మణు డగును అని భావము.



శ్రీకృష్ణపరమ గురుభ్యోనమః.

# మ న స్సా క్ష్య ము.

---

## —(*) ఉపోద్ఘాతస్తోత్రశ్లోకములు. (*)—

### —(*) మంగళశ్లోకము. (*)—

వృష్టింయో వితర త్యశేష తనుభృ త్సంజీవనీం యోవ్యధాత్ రక్షాం రమేవ సతశ్చ మాతు రుదరే యోమేపురై వోదయాత్ । ఆపాః బాయ నిధాయ మాతృ కుచయో దుగ్ధం తతోజీ జనత్ । భుక్తాన్నాంశ విభాజకాయ జగతః కర్త్రేఽస్తు తస్మైనమః॥ ౧॥

### —(*) క్షమాపణ (*)—

పితాసి లోకస్య చరా చరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ । నత్వత్స మో స్త్య భ్యధికః కుతోన్యో లోకత్రయే ప్యప్రతిమ ప్రభావ!! ౨॥

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయేత్వా మహమీశమీడ్యం। పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవసోఢుం॥ ౩॥

ఇంద్రియార్థ ప్రవృత్తానా మస్మాకం జగదీశ్వర । అపరాధ క్షమాయాస్మాం క్షమస్వత్వ మహైతుకీం॥ ౪॥

### —(*) తత్వప్రశ్న రూపక ప్రార్థన. (*)—

హేవిశ్వేశ్వర కిం సదైవ సగుణ స్సర్వత్ర కిం నిర్గుణ। స్త్వం కిం నాథ కదాచి దేవను గుణైః కింవా క్వచిద్యుజ్యసే । కింవాత్వత్పరి

నామ ఏష చిదచిన్మిశ్రః ప్రపంచో భవాన్ । కింవై తస్య నిమిత్త మాత్ర మథవా స్యాదింద్ర జాలక్రమీ॥ ౫॥

కింసత్యం జగదీశ్వ రైతదథవా మిథ్యా భవేతాం నుకిం । జ న్మాంతా వథవా నకిం చిదచితోః కింవా తయోస్తాపరః । స్యాతా మేకతరస్య తహీనను చితఃకింవే తరస్యేతివా । ప్రాజ్ఞా అప్యుదయద్వి కల్పచపలా మూకత్వమన్తేయయుః॥ ౬॥

సాలోక్యాది రభేద ఏవకిము తేమోక్షః స్వనాశోథవా । జీవ స్యాథచతస్యసాధనమపిస్యాత్కింతవోపాసనం । తత్త్వజ్ఞానమథాస్య కోనునియతః కతాప్రమాగోచరో । దేహప్రాణ విలక్షణ స్స్వభవతో భిన్నో భవా న్నేవవా॥ ౭॥

జీవాఖ్యస్య భవేన్నుతస్య నియతం కర్తృత్వ మస్త్యేవచేత్ । కింస్వేచ్ఛాను గమేవవాస్య భవదీ యేచ్ఛాను సార్యేవవా । స్వాతం త్య్రంయదికార్య భేదనియతం కస్మిన్ భవేత్తస్యతత్ । కస్మిన్ తే తదనాదితాపిచ కథం భూతాభ వేత్కారణః॥ ౮॥

తత్కార్యేషుచ కోన్ను పుణ్య ఫలకో ధర్మ స్తథైవాపరః। కో వాస్వర్నిరయాఖ్య యోశ్చ ఫలయోః కీదృక్స్వరూపం భవేత్ । కింజ న్మాంతర మస్తితస్య కిమునే త్యేవం మహాంతో భృశం । తర్కా ణాం ప్రతిరోధనా ద్భహు తరా న్నోన్నిర్ణయం లేభిరే॥ ౯॥

—(*) మనస్సాక్షిగోచరము. (*)—

తస్మాన్న తత్త్వం భవతోవ గంతుం సమర్థ భావోస్తి నుమా ఖిలేశ । తథా ప్యయం మానస సాక్షిణోభా త్యథోనను మానా దుప లభ్యమానః॥ ౧౦॥

కార్యత్వత శ్చిదచిదాత్మక విశ్వమేతత్ , కర్తారమీశ వినాన్నహి

భవే త్పురుష ప్రయత్నాత్ । భిన్నంచ కార్యమిహ దృష్టమతో భ్యు పేయో దాతా ఫలస్య భువిత త్త దదృష్టయోగాత్॥ ౧౧॥

ఏవం విశ్వస్య కర్తారం దాతారంచ ఫలస్యచ । త్వాంప్ర మాణేన విజ్ఞాయ సర్వథా శరణంగతః॥ ౧౨॥

—(*) ఉపాసనక్రమము. (*)—

చిజ్జడ విలక్షణ స్త్వం సర్వవ్యాపీ సమ స్త శక్తిమయః। యాథా తథ్యేనత్వాం జ్ఞాత్వోపాసితు మిహాస్తి కశ్శక్తః॥ ౧౩॥

చిత్తైకతా నత్వ భవామనస్క సుఖం యదాత్మాను భవం వదంతి । తన్నోభవా స్నాపిచ నాద బిందు కళాది లక్ష్యాణి తనా స్థితాని॥ ౧౪॥

విష్ణుశివా ద్యాకృతయః ప్రకృతివికారా స్తథా పరిచ్ఛిన్నాః। అప్రాకృతస్తు పూర్ణ స్త్వం తాఇతి కోను మన్యతే ధీరః॥ ౧౫॥

ప్రపంచ లింగాను మితోపి సమ్య గుపాసితస్స్యాః పరికీర్త్య మానః । అనన్య సాధారణ నామధేయై స్సర్వేశ్వరాద్యైరితి నిశ్చ యోమే॥ ౧౬॥

—(*)అనిశ్చితజీవస్వరూపము.(*)—

నోజానే కిము తత్వ మధ్యగమనః ప్రాణాత్మకోవా భవేత్। కిస్వంతః కరణాత్మకః కిము భవే త్తత్రాను బింబాత్మకః। కింబ్రహ్మై వ భవే దథాత్ర తదవచ్ఛిన్న స్తదంత గతః । యుక్తించిత్సము దాయఏవ కిమహం శబ్దాభిధేయః ప్రభో॥ ౧౭॥

—(*) పరిపూర్ణమనోనిశ్చయము. (*)—

స్యాద్వాదేవ యథాకథం దృఢధియా కర్తార మజ్ఞాసిషం।

త్వామత్ర త్వ్యసుఖాఘవా యదిపరం సౌఖ్యం తదధారయవా। కార్యం బుద్ధిమతాం త్వదీయభజనం నైవాస్త్యవా యాంతరం। తస్మాత్త్వాం ప్రభజామి సత్తమ జగన్నాథాదిమస్తోత్రతః॥ ౧౮॥

—(❁) { భగవద్గుణ క్రియా ప్రతిపాదక సర్వే శ్వరాది నామ స్తోత్రశ్లోకములు. } (❁)—

సర్వేశ్వర స్సర్వసాక్షీ సర్వజ్ఞ స్సర్వతోముఖః। సర్వాంత ర స్సర్వజయీ సర్వాధారశ్చ సర్వదృక్॥ ౧॥

సర్వశక్తి స్వరూపశ్చ సర్వానరిద స్వరూపకః। సర్వేంద్రియ ప్రేరకశ్చ సర్వయోగ వినిశ్చితః॥ ౨॥

సర్వేంద్రియగుణాభాస స్సర్వేంద్రియ వివర్జితః। సర్వాసు నిలయ స్సర్వ భర్తా సర్వాఘ నాశనః॥ ౩॥

సర్వవ్యాపీ సర్వదీన శరణ్య స్సర్వసమ్మతః। సర్వభోక్తా సర్వ సమ స్సర్వకర్మఫలప్రదః॥ ౪॥

సర్వయజ్ఞాధిప శ్చైవ సర్వకారణ కారణం। సర్వదేవాధిప స్సర్వ ప్రేరక స్సర్వకార్య కృత్॥ ౫॥

సర్వభూతాధి వాసశ్చ సర్వలక్షణలక్షితః। సర్వతీర్థాత్మక స్సర్వ కామద స్సర్వపాలకః॥ ౬॥

సర్వాభిసంధిఫలదస్సర్వరోగభిషగ్వరః। సర్వతేజ స్స్వరూపశ్చ సర్వలీలా వినోదకృత్॥ ౭॥

సర్వకాల స్వరూపశ్చ సర్వభూతాతి స్వరూపకః। సర్వస్వభావ రూపశ్చ సర్వధర్మ స్వరూపకః॥ ౮॥

సర్వజీవాంతరాత్మాచ సర్వోపద్రవ నాశనః। సర్వాది స్సర్వ విత్ సర్వ దర్శీ సర్వసహోపిచ॥

సర్వాత్మా సర్వతశ్చక్షు స్సర్వ ప్రహరణాయుధః । సర్వభూ
తాత్మ భూతాత్మా సర్వవాగీశ్వరేశ్వరః॥ ౧౦॥

సర్వవేదస్తుత స్సర్వ స్సర్వశస్త్ర భృతాం వరః । సర్వదేవమ
యస్సర్వ ప్రహరూపశ్చ శాశ్వతః॥ ౧౧॥

ఏవం లక్షణ సంయుక్తో భగవాన్ భక్తవత్సలః। వాసుదేవో
జగన్నాథః పాతుసర్వత్ర సర్వదా॥ ౧౨॥

---

సర్వేశ్వర స్తోత్రము.

సంపూర్ణము.

---



శ్రీ కృష్ణ.

## —(*) జగన్నాథస్తోత్రము. (*)—

౧, జగన్నాథో జగత్కర్తా జగద్రూపో జగద్గురుః।
భూతకృద్భూతభృద్విష్ణు ర్భూతభవ్య భవత్ప్రభుః॥
౨, నిరాకారో నిర్వికారో నియంతా చ నిరాలయః।
అక్షర శ్శిక్షక స్సాక్షీ ప్రధాన పురుషేశ్వరః॥
౩, శంభు స్స్వయంభూః పూతాత్మా భూతాది శ్శుచిరీశ్వరః।
అగ్రాహ్య శ్శాశ్వతో భర్తా నిత్యః పరమ మంగళం॥
౪, ప్రాణద శ్చాప్రమేయశ్చ పవిత్ర శ్శరణం కవిః।
కృతజ్ఞో౽నాదినిధన స్సమాత్మా౽జః ప్రజాభవః॥
౫, విశ్వయోని రమేయాత్మా లోకాధ్యక్ష స్సమో౽చ్యుతః।
ఊర్జితో౽తీంద్రియశ్శాస్తా ధర్మాధ్యక్షో జనార్దనః।
౬, అమోఘ శ్చామృతో నేతా మహోత్సాహో మహాబలః।
మహాబుద్ధి ర్మహావీర్యో మహాశక్తి ర్మహాద్యుతిః॥
౭, అనిర్దేశ్య వపుర్న్యాయో మహామాయ స్సనాతనః।
సుప్రసాదః ప్రసన్నాత్మా గురురావర్తనో విభుః॥
౮, ప్రజాపతి రసంఖ్యేయో దమనో విశ్వ కృద్ధ్రువః।
సిద్ధార్థ స్సిద్ధ సంకల్ప స్సిద్ధిదో వర్ధనో౽చితః॥
౯, వివిక్తో జగత స్సేతు స్సత్యధర్మ పరాక్రమః।
ఇష్టో౽ ప్రమత్తో వరదః ప్రఖ్యాతః పావనో౽తులః॥
౧౦, అశోక స్తారణ స్తుష్టః శరణం కారణం సుహృత్।
మహా విభూతి ర్విశ్వేశ స్సుఖదో హేతురున్నతః॥

౧౧, హరిర్విశ్వరు బీజంచ ధర్మో౽వ్యాప్తః పురాతనః।
ఆదిదేవో మహాదేవో దేవేశః పరమేశ్వరః॥

౧౨, దేవో౽నుకూలః ప్రచ్ఛన్నో విముక్తాత్మా కృతాంతకృత్।
ఆనందీ పరమశ్శాంత స్స్వవశో భగవానభూః॥

౧౩, అవిజ్ఞాతో జ్ఞానగమ్యో నిర్వాణంచ పరాయణం।
స్వాభావ్య స్సత్య సంకల్పో జితక్రోధ స్థిరో హరః॥

౧౪, గుహ్యో గభీరో గహన శ్శ్రీకర శ్శాంతి దాయకః।
అనంతాత్మా విశుద్ధాత్మా క్షేమ కృచ్ఛిన్న సంశయః॥

౧౫, లోకత్రయాశ్రయః పూర్ణ స్సత్తాస్తస్స్వప్రియః।
సృష్టా వ్యాపీ త్రిలోకేశో విశ్వమూర్తి రమూర్తిమాన్॥

౧౬, ధాతా వాసో దృఢో౽నంతో దుర్లభో భక్తవత్సలః।
లోకనాథో లోకబంధు రవ్యక్త శ్శోకనాశనః॥

౧౭, అదృశ్యః పావనో౽చింత్య శ్శ్రీశవ్యో భయనాశనః।
లోకవ్యాపీ దమయితా మాన్యఊర్జిత శాసనః॥

౧౮, ఉత్తారణో౽నాదిరేకో లోకాధిష్ఠాన మవ్యయః।
అంతర్యామీ స్వస్తిదశ్చ సచ్చిదానంద విగ్రహః॥

౧౯, అసహాయో దుష్కృతిహా పుణ్య శ్రవణ కీర్తనః।
పరాత్పరం పరంబ్రహ్మ రక్షణః కరుణానిధిః॥

౨౦, భవరోగ భిషక్పాప నాశనః ప్రాణ జీవనః।
శరణ్య స్త్రాణ నిరత స్స్మృత సర్వాఘ నాశనః॥

౨౧, అజిత స్తత్త్వవిద్భర్గో భీమో విశ్వంభరో మృడః।
ఋతధామా సత్యసంధః పురుషోత్తమ ఆత్మభూః॥

౨౨, మృత్యుంజయో విరాడుగ్రో మంతవ్యో నిస్సమాధికః।
మహేశ్వరో మహాకర్మా మహనీయో మహాయశాః॥

౨౩, భూతాత్మా పరమాత్మాచ ముక్తానాం పరమాగతిః।
వంద్యో భక్త ప్రియోదీన శరణ్య శ్శంకర శ్శివః॥
౨౪, ఏవంవిధ స్సర్వ జగన్నాథో మే పరమాగతిః।
సర్వాన్ దోషాన్ సముత్సార్య సదాసర్వత్ర పాతుమాం॥

—※ చరమశ్లోకము. ※—

జగన్నాథ హృషీకేశ సర్వకారణ కారణ । శ్రీకృష్ణాయ నమస్తుభ్యం భుక్తిముక్తిప్రదాయినే॥

—※ ఉపోద్ఘాతస్తోత్ర శ్లోకములకు భావము. ※—

శ్లో ॥ వృష్టిం అను మంగళశ్లోకమునకు భావము.

చరాచర భూతములయొక్క సమస్త శరీరములకు సాక్షాత్తుగాను పరంపరగాను పోషణకరమయిన వర్షమును నాయా దేశములలో తదనుకూల కాలములలో నెంతెంత మాత్రము ఎవడుకురిపించుచున్నాడో ఆకురిపించుటలో జీవులకు శ్రమ కలుగకుండా బిందువులుగా గురిపించుచున్నాడో నేను మాతృగర్భములో నుండునపుడు ఎవడు రక్షించినాడో జన్మించక ముందే యాహారార్థముగా నా తల్లికుచములందు పాలు ఉంచి యనంతరము నన్నెవడు పుట్టించినాడో భోజనము చేసిన పదార్థములను జీర్ణింపజేసి రసమును ఇంద్రియత్వఙ్మాంసాస్థి నఖ దంత కేశశ్మశ్రువులు మొదలయిన వానికి నెవడు అన్యోన్యవిధ రసముల బంచిపెట్టుచున్నాడో జగత్తుకు నెవడు కర్తగానున్నాడో అనగా సమస్త ప్రపంచ పదార్థములను జేయుడము వాట్లకు దత్తత్స్వభావములను గలుగజేయుటయు.

ఇందుకు వివరము, సూర్యచంద్ర భూగ్రహాది నక్షత్రములు క్రింద మీద నేసంబంధము లేక నిరాధారముగా నిల్చి తమతమ నియత గతులు తప్పకుండా సంచరించుటయును సముద్రము నిర్హేతుకమ్మో

గా బోశెకుక్కటయును మేరమీరక య్యుండుటయును వాయువు వీచ డము ఋతుధర్మములు జరగడము వానియందు ఓషధులు పుష్పించి ఫలించడము క్షామ డామరములు కలుగడము ఈలాటి యచింత్యకార్య ములు గల ప్రపంచమున కేవలము కర్తగాను, నియామకుడుగాను, నున్నాడో వానికి నమస్కారము.

ఇందుకు, విష్ణుపురాణములో, ౧ అం ౧౯ అ ౭౯ శ్లో॥ నమ స్తస్మై నమస్తస్మై నమ స్తస్మై మహాత్మనే। నామరూపం నయ స్యాస్తి యో స్తిత్వే నోప లభ్యతే ॥ అనియున్నది. అనగా, ఎవనికి నామరూపములు లేవో, ఎవడు ఉన్నాడని మాత్రము తెలియబడునో అట్టి మహాత్మునికి ముమ్మారు నమస్కారము. అనిభావము.

ఏలననగా, భగవంతునికి గుర్తుకొఱకు పేరుపెట్టుటకు తలి దండ్రులు లేరు గనుక నున్నా పరిపూర్ణుడు అనిర్దేశ్యుడు నగుట చేతనున్న ఆయనచేయు జగత్కార్యలింగాను మానముల చేతనే, ఆయనను నిర్ణయించు కొనవలసినది. ఇట్లని బ్రహ్మసూత్రములలో గూడా మొదటి సూత్రము, "అథాతోబ్రహ్మజిజ్ఞాసా" అని యారం భించి రెండవ సూత్రములో, "జన్మాద్యస్యయతః" అని బ్రహ్మమును నిర్దేశించి నాడు అందుకు భాష్యాదులలో, "జగజ్జన్మాదికారణ త్వాత్" అని వ్రాస్తియున్నాడు. ఈవ్యాసులవారే విష్ణుసహస్రనామ ప్రారంభములో ॥ శ్లో ॥ యత స్సర్వాణి భూతాని భవన్త్యాది యుగాగమే। యస్మింశ్చ ప్రళయం యాంతి పునరేవ యుగక్షయే। తస్యలోక ప్రధానస్య జగన్నాథస్య భూపతే। విష్ణోర్నామ సహ స్రంమే శృణుపాప భయాపహం. అనియును జెప్పియున్నాడు.

అనగా, ధర్మరాజా సృష్టికాలమందు ఎవని వలన సమస్త

భూతంబులను బుట్టుచున్నవో, ప్రళయకాలంబున నెవని యందు. లయించుచున్నవో, అట్టిలోక ప్రధానుండు జగన్నాథుండు నగు విష్ణుని నామసహస్రంబు పాపంబులం బోగొట్టునది. దానిం జెప్పెద వినుము. అనిభావము.

గీతలలో విభూతి విస్తర యోగాధ్యాయమునందు. ౨ శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే। ఇతిమత్వాభజంతే మాం బుధాభావ సమన్వితాః ॥ అనియున్నది అనగా నేనుసమస్తము నకును ఉత్పత్తికారణమయిన వాడను నావలన సమస్తము ప్రవర్తిం చుచున్నది. అని పండితులు తలచి భజించుచున్నారని యున్నది. కాబట్టి పురుషప్రయత్న సాపేక్షములు గానివియు దేవుడు సాక్షాత్తుగా గాని లేక యాయావస్తువులను వానియందు దత్తత్స్వభావము లను గలుగ జేసి వానిని నియమించి చేయించు కార్యములుగా గాని యుండు యీపంచానుమానములు మొదలయిన వాట్లచేత జగన్నాథుడైన వానిని నిశ్చయించి వానికి నమస్కారము చేయుచున్నా నని భావము.

—(*) ఉపోద్ఘాతం (*)—

—* ౨, శ్లో॥ పితాసి లోకస్య వానికి భావము. *—

ఇది, భగవద్గీతల లోనిది పైశ్లోకములో జెప్పిన ప్రసిద్ధములైన పంచానుమానముల చేత జగత్తుకు కర్తయగుట వలన, చరాచర లోకమునకు దండ్రివైతివి అందరికంటె గొప్పవాడవగుట చేతే నీవే పూజనీయుడవు నీకుసమానుడే లేనప్పుడు నీకంటెనధికుండెవ్వడును లేడు. సమస్త లోకములలో నప్రతిహతమైన ప్రభావము గల వాడని భావము.

౩, శ్లో॥ తస్మాత్ ప్రణమ్య అనుదానికి.

ఇది, గీతలలోనిది. అందువల్ల నాశరీరమును సాష్టాంగముగా వేసి నమస్కరించి నియామకుడవైనట్టియు స్తోత్రార్హుడవైనట్టియు నిన్ను బ్రసన్నునిగా జేసికొను చున్నాను, ఓస్వామీ కుమారుని యపరాధములను దండ్రివలెనన్ను జెలికాని యపరాధములను స్నేహితుని వలెనన్ను ప్రియురాలి యపరాధములను ప్రియుని వలె నన్నూ సహింప దగుదువు అనిభావము.

అయితే దేహము బడవేసి నమస్కరించుట వలన దిక్పరిణామము గలిగి దేవునికి బరిచ్ఛిన్నత గలుగ లేదా యని యందురు మహాత్మ్యదియానుల వలె పశ్చిమ దిక్కును నిర్ణయింప లేదు గనుక పరిపూర్ణుడైన వానికి నేదిక్కున నయినా తన విధేయతను దెలుపుటకు దండము పెట్టుట. ఇందువల్ల దేవునికి పరిచ్ఛిన్నత యేర్పడదు.

౪, శ్లో॥ ఇంద్రియార్థ ప్రవృత్తానా మనుదానికి.

మేము ఇంద్రియార్థములందే ప్రవర్తించుచు నపరాధక్షమాపణోపాయములు చేయకనే యపరాధములను క్షమింపుమని కోరుట యను మాతప్పు మన్నించ వలయును అనిభావము.

తత్వప్రశ్నరూపకప్రార్థన.

౫, శ్లో॥ హేవిశ్వేశ్వరయనుదానికి.

సమస్త ప్రపంచమునకు ప్రభువైనవాడా నీవెల్లపుడును గుణములతో గూడుకొని యుండువాడవా లేక యేగుణములు లేనివాడవా లేక కాలవిశేషము నగుడు గుణములతో గూడుకొను చున్నావా లేక విభువైన నీస్వరూపమందు కొంత ప్రదేశమందు గుణ యుక్తుడ వవుదువా యీచిదచిత్ప్రపంచము నీపరిణామమా లేక ఈప్రపంచమునకు

నీవు నిమిత్త కారణమా అనగా చిదచిత్తులు వేరువేరుగా నుండి వానిని ప్రపంచాకృతిగా జేయువాడవా యనుట. లేక యైంద్రజాలికుని వలెనే యీప్రపంచమును భ్రమముగా గల్పించు వాడవా యని భావము.

౬, శ్లో॥ కిం సత్యం అనుదానికి.

ఓ యీశ్వరుడా యీజగత్తు సత్యమా లేక మిథ్యయా చిదచిత్తులకు జన్మనాశములు కలవా లేవా లేక చిదచిత్తులలో నొకదానికి మాత్రమే జన్మనాశములు కలుగునా అట్లైన యెడల నాజన్మనాశములు చిత్తుకు గలుగునా యచిత్తుకు గలుగునా యని యీప్రకారము పండితు లయినను మనస్సున బుద్ధిడు వికల్పముల చేతను జంచలులై కడపట మూఢాగతనమును జెందిరి గథా యనగా నేమియును జెప్ప జాలరైరనుట.

౭, శ్లో॥ సాలోక్యాది యనుదానికి.

మోక్షమనునది నీయొక్క సాలోక్య సామీప్య సారూప్యములా లేక నీలోగలిసిపోవుటా లేక తనజీవ స్వరూపమున్ను నాశముకె నుండనుటా మోక్షసాధనోపాయము దహర విద్యాద్యుపాసనలా లేక తత్వజ్ఞానమా లేక బ్రహ్మాద్వితీయ జ్ఞానమా మోక్షసాధనమున కు ప్రయత్నించు జీవుడను వాడెవడు వానికి నుత్పత్తి నాశములు కలవా లేవా లేవని శాస్త్రములలో జెప్పుటయేగాని శిశువుమృతిబొందితె ఔర్ధ్వదైహిక క్రియలు పనిలేదని అందులోనే చెప్పి యుండుట వలన జీవుడు అప్పుడే పుట్టి అప్పుడే నశించుట వలన పుణ్యపాపహేతుక కర్మములు వాడు చేయనందున లోకాంతరము జన్మాంతరము వానికి లేదని యీక్రియలు చేయ బనిలేదని చెప్పినట్లు భావమగుచున్నది. అట్లు లేకజీవుడు ఉత్పత్తినాశములు లేనివాడవో నేని అనాది

కృత కర్మదోషములు పోయి ఊర్ధ్వలోకము కలుగుటకు శిశువు మృతి బొందితేనే యూర్ధ్వ దైహిక క్రియలు ఏలచేయగూడదు.

మరియును, యాజ్ఞవల్క్యస్మృతిలో ప్రాయశ్చిత్తకాండము లో జీవోత్పత్తి ప్రకరణములో జీవులకు నుత్పత్తి గలదని వ్రాసియు న్నారు. బృహదారణ్యకము చతుర్థాధ్యాయములో నీప్రకారము జీవోత్పత్తి చెప్పబడియున్నది. మరికొందరు జీవులకు నుత్పత్తి గాని మోక్షానంతర మందు తిరుగా జన్మముగాని జీవులకు గలుగ వలసి యున్నది. అట్లు లేనియెడల కాలమున కంతము లేనందున కల్పము నకు జీవుడొకడు ముక్తుడైన జీవులందరు ముక్తులై సర్వముక్తి ప్రసంగము వచ్చును ఆపక్షములో ప్రపంచమే లేకపోవలసివచ్చును. అప్పుడు బ్రహ్మమునకు కార్యము లేకపోవును. అనిచెప్పెదరు ఈలాటి భాగములన్ మనస్సాక్షికి గ్రాజాలవు.

మరియు, జీవుడను వాడు దేహమా ప్రాణమా అంతఃకర ణమా అంతఃకరణ ప్రతిబింబమా లేక అంతఃకరణావచ్ఛిన్న చైత న్యమా లేక వీనిలోజేరిన కొన్ని సమష్టియా లేక వీనికంటె విలక్ష ణుడా వాడు నీకంటె భిన్నుడా నీవేనా లేక నీయంశమా యని భావము.

౮, శ్లో ॥ జీవాఖ్యస్యయనుదానికి.

జీవుడను వానికి కర్తృత్వము గలదా లేదా కలిగియున్న ప క్షమందు జీవుని స్వేచ్ఛాధీనమా లేక నీప్రేరణ వల్ల జేయుచున్నా డా కొన్నికార్యము లట్లును గొన్ని యిట్లును జేయుచున్నాడను నెడల నేయే కార్యములు చేయుటకు స్వాతంత్ర్యము ఏయే కార్యములు చేయుటకు పారతంత్ర్యము పరతంత్రుడుగా జేయు కార్యములు అనాదికర్మవశముగా నంతర్యామియైన నీప్రేరణవల్లగదా చేయు చున్నాడు.

—(*) కర్మము యొక్క యనాదిత్వ మెట్టిది. (*)—

కర్మముయొక్క యనాదిత్వ మెట్టిది యనగాబూర్వ పూర్వ జన్మకృత కర్మానుసారముగా ను త్తరో త్తర జన్మంబుల యందుఫలములను దేవుడైన నీవుఇచ్చు చున్నాడవనియు నిందు వలన నీకు వైషమ్యాదులు లేవని సాధించుటకు గదా జన్మాంతరము నంగీకరించు చున్నారు. ఆదిసృష్టియందు జీవులకు బూర్వ జన్మార్జిత కర్మములే నందున నరమృగ పక్షివృక్ష పాషాణాది నీచోచ్చ జన్మములకు అనురూప్యమయిన కర్మమెక్కడిది. ప్రపంచసృష్టికి ఆదిలేదు. ప్రవాహతో నిత్యత్వము. అని చెప్పితే అదయు క్తి లేని మాటగా నున్నది.—

మఱియు, దేవుడు సృజించి నట్లు కాకపోవలసివచ్చును. ఆయా భూతముల సృష్టికి ముందు వెనుక నుండు కాలములను బట్టి ఆద్యంతములు ఏర్పడవలసే యున్నది కాబట్టి ఆయాజీవుని యాదిసృష్టికి పూర్వకర్మ మెక్కడిది.

మరియు బూర్వజన్మకర్మస్మృతి లేని వానికి నిప్పుడు ఫలమ్మునిచ్చుట, కర్తయొక్కడును ఫలభో క్త మరియొక్కడునుగా నేర్పడును గనుక న్యాయ విరోధమగును గాబట్టి కర్మము యొక్క యనాదిత్వ మెట్టిది యని భావము.

౯; శ్లో॥ తత్కార్యేషుచ అనుదానికి.

—(*) ధర్మాధర్మస్వరూప మెట్టిది. (*)—

కర్మము వల్ల గలిగు పుణ్య పాపముల నిచ్చు ధర్మాధర్మస్వరూప కర్మము లెట్టివి. అనగా కొన్ని దేశములలో మాతులకన్యను వివాహమాడుచున్నారు కొన్నిమతముల వారు పినతల్లి పినతండ్రి కొమార్తెలను వివాహము చేసి కొనుచున్నారు బ్రాహ్మణులు పూర్వము మాంసాదులు దినుచుండిరి. "సత్యాన్నాస్తిపరోధర్మః" అని

చెప్పుచున్నారు. వృత్తి ప్రాణనాశాదులందు అనృతమాడుట కొన్ని సమయములలో ధర్మ మనుచున్నారు. "అహింసాపరమోధర్మః" అని చెప్పుచున్నారు. యజ్ఞాదులందు పశుహింస చేయవచ్చునని చెప్పు చున్నారు. ఇట్లు దేశభేదముల చేతను కాలభేదముల చేతను మతభేద ముల చేతను ధర్మాధర్మములు శౌచ రూపాచారములు ప్రకారాదులు ఈ మొదలయినవి యనేకములు వారువారును అవే సద్ధర్మము లని భిన్నభిన్నములుగా జేయుట వల్ల నివి పుణ్య జనక కర్మము లనియు నివి పాప జనక కర్మము లనియు నేర్పడలేదు వీనికి ఫలములు స్వ ర్గ నరకములను లోకములున్న వనియు నక్కడ ననుభవించుచున్నా రనియు జన్మాంతరముల లోనే సుఖదుఃఖాది రూపముగా ననుభవిం చు చున్నారనియు గొందరీ జన్మములోనే యనుభవించుచున్నారనియు నానావిధములుగ నాయా మతస్థులు చెప్పుచున్నారు. అవి యెట్టివి జీవునికి జన్మాంతరము కలదా లేదా? కొందరు లేదనుచున్నారు. యీలాగున వేదశాస్త్రములలో నానావిధములుగా జెప్పబడి యుం డుటచేత నీప్రకారము సంశయములు గలిగి వాదమునందు పరస్పర తర్క ప్రతిరోధము వల్ల పండితులుగూడా తత్వములు ఏకరీతిగ నిర్ణ యింప జాలకే యున్నారని భావము.

ఇందువల్లనే తమకుతమకు దోచినట్లు భావకల్పనలు చేసి యనేక మతములు గల్పించి యున్నారు. ఇందుకు॥ (గీ) మర్మమెరుగ లేక మతములు గల్పించి। యుర్విదుఃఖులగుదు రొకరి కొకరు। గా జులయింటిగుక్క కళవళ పడురీతి। విశ్వదాభిరామ వినుర వేమ॥ శైవ వైష్ణవాది సకల మతంబుల। దేవుడొక్కడనుచు దెలియలేరు। తమకు భేదమైతె తత్వరీతి భేదమా। విశ్వదాభిరామ వినుర వేమ॥ అని చెప్పబడియున్నది. యిందువల్ల అందొకటియు గొన్ని కొన్ని

భాగములయందు యాప్తికముగా నుండలేదు. అట్టి యాప్తికి రాని సంగతులను మనకు తెలియనివియును సంకేత సిద్ధములయిన పంచీకరణాది తత్వాంశములున్నూ మనస్సాక్షికి రానందున బ్రయోజనము లేదని వ్రాయలేదు ఎట్లనగా నైయాయికులు వైశేషికులు ప్రపంచ సృష్టికి ఆకాశభూతము గాకనాలుగే తత్వములని చెప్పియున్నారు. మరియు ఛాందోగ్యోపనిషత్తులో పృథివ్యప్తేజస్సులను నిమ్మూడింటికే త్రివృత్కరణము చెప్పబడియున్నది. ఇందువల్ల నొకనిర్ణయముగా లేదు గనుక వ్రాయలేదు.

౧౦, శ్లో॥ తస్మాన్న అనుదానికి.

—(*) మనస్సాక్షిగోచరము. (*)—

ముందు చెప్పిన ప్రకార మెవ్వరికేని నిర్ణయింప నలవిగాకుంటుట వలన నేను మాత్రము నీతత్వమును నెరుంగ నెట్లు సమర్థుడనగుదును అయినను అనుమాన ప్రమాణముల చేత, నామనస్సాక్షికి ముందు జెప్పంబడు నీయర్థము స్ఫురించు చున్నదని భావము. యెద్దియనగా.

౧౧, శ్లో॥ కార్యత్వతః అనుదానికి.

లోకమునందు ఘటాది కార్యములు కులాలాది కర్త్రపేక్షము గానే గలుగుచున్నది గావున కార్యభూతమైన యీచేతనాచేతనాత్మక ప్రపంచము పరమ కర్త లేక గలుగ జాలదు మరియును, నేఫలము నుద్దేశించి పురుషుడు ప్రయత్నించు చున్నాడో దానికంటె భిన్నము గానున్నూ కార్యము గలుగుట చూచుచున్నాము గావున నద్యోపాత్తుల యదృష్టాను సారముగా ఫలముల నిచ్చువాడొక డుండవలయునని యంగీకరింప వలసి యున్నదని భావము.

అదృష్ట మనగా ప్రాణి, దేవుని వలన పొందే శుభాశుభ ఫలములకు హేతువు కనుపడనిది.

౧౨, శ్లో॥ ఏవం అనుదానికి.

—(*) శరణాగతి. (*)—

ఈప్రకారముగా ననుమాన ప్రమాణముల చేత ప్రపంచమునకు కర్తవును ఫలదాతవు నైన నీవొక డున్నాడవని తెలిసికొని సర్వప్రకారములచే నిన్ను శరణు పొందితి. శరణాగతి అనగా నీవు కలుగజేసిన లౌకిక దృష్టహేతుక ఫలములయందు మాత్రము ఇతర ప్రయత్నములు చేయుదును గాని యదృష్టహేతుక ఫలములయందు సర్వఫలప్రదాత నీవే గనుక సర్వవిషయముల సిద్ధికి నీవే గతియనినమ్మి నిన్నే ప్రార్థించెదను నమ్మడము ఎట్లనగా శునకము స్వామిని అనుసరించి నట్లును స్తనంధయుడైన శిశువు తల్లిని విడువ నట్లును ఎంత శ్రమపరచినా పతివ్రత భర్తను విడనాడనట్లును నిన్నేనమ్మితి ననుట యిట్లని భావము, నిన్నేయనుటకు గీతలలో ॥ శ్లో ॥ అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే ।, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం ॥ అన్యచింత లేక నన్ను జింతించువాని యోగక్షేమమును నేను వహించు చున్నానని దేవునిచే జెప్పంబడియున్నది. యోగమనగా నిక శుభములను గూర్చుట క్షేమమనగా నిదివరకు కలుగ జేసిన శుభములను రక్షించుట ఇందు వల్ల ననన్యగతికముగా నిన్నేనమ్మితి ననుట. ఇందుకు ప్రాచీన ॥ శ్లో ॥ అరిర్మిత్రం విషం పథ్యం అధర్మో ధర్మతాం వ్రజేత్ । అనుకూలే జగన్నాథే విపరీతే విపర్యయః ॥ అనియున్నది. అనగా, జగన్నాథు డనుకూలుడైన యెడల, శత్రువు మిత్రుండగును, విషంబును పథ్యంబగును, అధర్మము ధర్మంబగును, అతడు విపరీతుడైనచో, నివి యన్నియు

విపరీతము లగును, అనిభావము. కాబట్టి సర్వమునకు జగన్నాథు డైన నీవేగతియనుట.

౧౩, శ్లో॥ చిజ్జడ యను దానికి.

—(*) ఉపాసన క్రమము. (*)—

అనుభూత విషయములైన చేతనాచేతనములకంటె నీవు విలక్షణుడవై అంతట వ్యాపించి సర్వ శక్తి స్వరూపుడవై యున్నావు ఇట్టి నీస్వరూపమును యథార్థముగా తెలిసికొని యుపాసించుటకు నెవడు శక్తుడు అని భావము.

౧౪, శ్లో॥ చిత్తైకతానత్వ యనుదానికి.

—(*) బ్రహ్మేతరానుభూత విషయోపాసనలు. (*)—

లోకమున గొందరు చిత్తైకాగ్ర్యము వల్ల గలుగు సౌమనస్యసుఖము బ్రహ్మ సాక్షాత్కారమని చెప్పుచున్నారు మనస్సుయొక్క ఏకాగ్రత వలన బుట్టినది గావున నాసుఖము నీవు కాజాలవు శ్వాస నిరోధాది హఠయోగ లయయోగ మంత్రయోగ లంబికాయోగాదులు చిత్త శుద్ధ్యాది పూర్వకముగా మనస్సుకు ఏకాగ్రత్వ జన్య సుఖ సంపాదకములు గాన నవి నీవుకావు మరి కొందరు ముద్రాకరణాదుల వలన కనుపించెడు నాదబిందు కళలు మొదలగు లక్ష్యములు నీవని చెప్పెదరు ఎట్లనగా॥ శ్లో॥ వేద శాస్త్ర పురాణాని సామాన్యగణికా ఇవ। ఏకైవ శాంభవీముద్రా గుప్తా కులవధూరివ॥ అని చెప్పు చున్నారు॥ అనగా, వేద శాస్త్ర పురాణములు వేశ్యల వంటివి శాంభవీముద్ర యొక్కటి మాత్రము జాగ్రత్తతో రక్షింపబడిన కులస్త్రీ వంటిది. అనిభావము ఇవి ఇంద్రియ సన్నికర్షముల వలన శరీరమునందు బుట్టిన యీనాదాది లక్ష్యములు నీవని యెట్లు చెప్ప వచ్చును ఇందుకు తత్వపిందువులో పద్యం॥ ( చ ) అమరిన

యేకతత్వమని యజ్ఞులకు న్వేలయించి దేహము । ధ్యేయము నేను నొక్క లక్ష్యము పదంపడి చూపుదు రేమెరుంగకే । క్రమమున మూఖులై పిదప ఖండవివేకులు గాన వారినే । మములు గ్రహింపగా దగదు మాన్యవివేకులకున్ గుణోత్తమా ॥ అని యున్నది మరియును. విష్ణు పురాణములో ॥ శ్లో ॥ సర్వే బ్రహ్మ వదిష్యంతి సంప్రాప్తేతు కలౌ యుగే । నానుతిష్ఠంతి మైత్రేయ శిశ్నోదర పరాయణాః ॥ అని యున్నది అనగా కలియుగము రాగానే యందరును బ్రహ్మవాదము సేయుదురు. అయితే వారందఱును శిశ్నోదర పరాయణులై దాని ననుష్ఠింపరు అనిభావము గనుక యేదో వకవిధముగా నందరు బ్రహ్మ స్వరూపమును జెప్పుచున్నారు వాటిని నమ్మగూడదు.

మరియును అక్షి పురుషవిద్య మధువిద్య వైశ్వానరవిద్య శాండిల్యవిద్య ఉపకోసలవిద్య అంతరాదిత్య విద్య దహరవిద్య యామొదలయినవిన్నీకార్య కోటిలో జేరిన వాని విషయములు గాన నాయుపాస్యములు నీవెట్లగుదువు.

అయితే ఇట్టి వివిధోపాసనలున్నూ నీయందు గల విశ్వాస సూచకము లయిన యాలంబనము లగుట వలన గొంతవట్టుకు వాటలయందు నీదయ గలుగ వచ్చును అమనస్కానంద విషయమై శుక్ల యజస్సు వాజసనేయ బ్రాహ్మణములో ఆనందమే మనస్సని చెప్పబడి పిమ్మట మనస్సే బ్రహ్మమని చెప్పబడి యున్నది మనస్సు బ్రహ్మమెట్లగును మాండూక్యోపనిషత్తుకు గౌడపాదాచార్యులవారు చేసిన కారికలలో చిత్తైకాగ్ర్య జన్యానందము బ్రహ్మము కాదనియు జ్ఞానముచేతనే బ్రహ్మము ననుసరించవలయు నన్నియు జెప్పబడి యున్నది ఇందుకు ప్రాచీనపద్యము॥ (ఉ) కొందరు మంత్ర తత్పరులు కొందరు ధ్యానమున స్వమోహితుల్ । కొందఱిల హఠాభ్యసన గోష్ఠిగృశిం

తురు లేకజా కకజాశుల్ । కొందరు వేదపాఠకులు కొందరుచిక్కడు రాగమంబులజ్ ।గొందరుతారకంబుమదిగూర్చుచునుందురు భ్రాంతు లందరుజ్ ॥ ఇందువలన నాద బిందుకళలు అక్షి పురుషాది విద్యలు బ్రహ్మమని యాలంబనసౌకర్యార్థమగ్గా గల్పించినట్లు షడ్విధ సహా ధులవలన గలిగే చిత్తైకాగ్ర్య జన్య నిర్వికల్పానందము బ్రహ్మమని యుపాసనార్థముగ జెప్పబడినట్టుతోచుచున్నది చిత్తైకాగ్రత్వము వలన గలుగు నానందము బ్రహ్మ మైనట్లైతే సుషుప్తి ప్రారంభానం దమున్ను స్థలనానందమున్ను మాదక వస్తు సేవానంధమున్ను బ్రహ్మము కావలసి వచ్చును.

అయితే అమనస్కానందము నిర్విషయానందము అని చెప్పచు న్నారు. మాదక వస్తు సేవానందము సుషుప్తి ప్రారంభానందము విషయమును నిమిత్తీకరించి యింద్రియద్వారా మనస్సుకు ఆనందము గలుగజేయునది కాదు సాక్షాత్తుగా మనస్సుకు ఆనందము గలిగే దేను ఇదేరీతిగ చిత్తైకాగ్రత సమాధి వలన మనస్సుకు సాక్షా త్తుగా ఆనందము గలిగే దేను కొందరు ఈలాటి భ్రాంతి చేతమాదక వస్తువులను వాటి సేవనము వలన గలిగే ఆనందమును బట్టి యుదాసీ మతస్థులు మొదలయిన యద్వైత మతస్థ బయిరాగులు బంగి ఆకు కల్లిని జ్ఞాన పత్రి యనియు నిమ్మాకజ్, రామానంది, హాతీరాంజీ హాకాడా, మొదలయిన సంప్రదాయస్థులగు ద్వైతమతస్థ బయిరా గులు బంగిఆకు నూరిన రసమును రామ రసమేనియు. కొందరు వైష్ణవ శాక్త భైరవ క్షపణక కాపాలిక కాలాముఖాది మతస్థులు మద్యమును సమస్తము పావనము చేయు తీర్థమనియు ఈలాగున అతిగౌరవముగా జెప్పచున్నారు. పైన వ్రాసిన హేతువుల్లను బట్టి యేదియున్ను బ్రహ్మము కాదు.

అయితే అమనస్క సమాధి యందు మనోలయము గలిగి బ్రహ్మానందమే శేషించి యుంటున్నదని చెప్పుచున్నారు. అదిఅబద్ధము. ఇందుకు సీతారామాంజనేయములో అమనస్క సమాధివిషయములో ఆలోకించి ఏవృత్తులు లేక మనస్సునిశ్చలముగా నైన నుంటున్న దని చెప్పబడి యున్నది.

మరియును అమనస్క సమాధిస్థునికి ఆసమయములో వానికి దెలియకుండా ముక్కు వద్ద క్లోరోఫార మించితే మనోలయమరు క్షీణపడుతాడు. అప్పుడు ఆయానందముండదు గాన నదిమానసికా నందమే గాని యమనస్కానంద మనగూడదు.

౧౫, శ్లో॥ విష్ణుశివాద్యాకృతయః అనుదానికి.

మరియు కొందరు విష్ణుశివాది రూపములు నీవనియుపాసించె దరు. ఆరూపములన్నియు శుద్ధసత్వమయము లనిచెప్పినను ఆశుద్ధస త్వమున్ను ప్రకృతి గుణమే గనుక అవియును ప్రకృతివికారములును బరిచ్ఛిన్నములు నై యున్నవి ప్రకృతికంటె విలక్షణుడవై సర్వత్రప రిపూర్ణుడవై యున్ననిన్ను దొల్త చెప్పిన విష్ణ్వాది రూపములు గల వానిగా బుద్ధిమంతు డగు వాడెవడు తలచు నని భావము.

౧౬, శ్లో॥ ప్రపంచ లింగయనుదానికి.

గావున దొల్త చెప్పినట్లు ప్రపంచలింగానుమానముల చేత దెలి యబడు నిన్ను అనన్య సాధారణములైన సర్వేశ్వరాది నామముల చేతకీర్తించుటయే చక్కగా నుపాసించినట్లగునని నానిశ్చయముఏల నంటే జగన్నాథ సర్వేశ్వరాది నామములకు అర్థము భగవంతు డే గాబట్టి సాక్షాత్తుగ మతి భగవంతునే చెందుచున్నది. ఇందుకు భాగవతము నందు॥ శ్లో॥ సర్వేషా మప్యఘవతా మిదమేవ సుని ష్కృతం। నామవ్యాహరణం విష్ణో ర్యత స్తద్విషయామతిః॥ విష్ణువు

అనగా సర్వవ్యాపకుడయిన భగవంతుడు తన్నామకీర్తనమునాయన యందు మతికలిగించుచున్నది కాబట్టి భగవన్నామకీర్తనమే పాప ముచేసిన వారందరికి మంచిప్రాయశ్చిత్త మనియున్నది. సేశ్వరమతస్థులందరు గజేంద్రస్తోత్రము వలె భగవంతుని నసాధారణనామములచేతనున్ను ఆయన చేయు కార్యముల బట్టియు దయాది గుణముల బట్టియు స్తుతించుచున్నారు: కాబట్టి యిది యద్వారముగా భగవంతుని జెందు నుపాసన యయ్యెను. ఇందువల్ల నిది ముఖ్యమైనది. తక్కిన యుపాసనలు సద్వారముగా భగవంతుని జెందునవి గనుకనవి యముఖ్యము లయినవి.

—(*) అద్వార సద్వారోపాసనల వివరము. (*)—

అద్వార సద్వారము లనగా మొదటిది జగన్నాథాద్యసాధారణ నామములతో జేయునది ఎట్లనగా, మనకు, ఆయననామరూపములను దెలియని రిష్యాదేశపురాజును రిష్యాచక్రవర్తియనుట తోడనే సాక్షాత్తుగా నెట్లు ఆచక్రవర్తియందే యామాటయొక్క అర్థము నిల్చునో అట్లు భగవంతుని స్వరూప మెట్టిదైనను ఈనామముల కర్థము. ఆయనే యగుచున్నాడు. సద్వార మనగా దేహ స్వభావములయిన చిత్తైకాగ్రతాది జన్యానందము బిందు నాదకళాది లక్ష్యములు అష్ట పురుషాది విద్యలు యివి మొదలైనవియు శివ విష్ణ్వాదులును వారి యర్చాదులును పైన చెప్పిన హేతువులే వల్ల సాక్షాత్తుగ బ్రహ్మము కాజాలవు.

అయితే మందాధికారులకు అవ్యక్తుడైన భగవంతుని విషయమైన మతినిల్చుట అసాధ్యము ఇందుకు ॥ గీతలలో ॥ శ్లో ॥ అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే అనియున్నది గాన నిందుకు మందాధికారులకు మతినిల్చుటకునివి సాలంబనోపాయములుగా నయ్యె

నెన్నగా ధ్వన్యాత్మక వర్ణములకు అకారాది క్షకారాంత లిపులు గురుతులైనట్లు సాలంబనోపాయములు. ఇవే సద్వారకములైన యుపాసనలు ఇందుకు అశ్వమేధపర్వములో నుత్తరగీతలయందు॥ శ్లో॥ అగ్నిర్దేవోద్విజాతీనాం మునీనాం హృదిదైవతం । ప్రతిమా స్వల్ప బుద్ధీనాం సర్వత్ర సమదర్శినాం ॥ అనగా ద్విజాతులు అగ్నిని దేవతగా దలచి హోమాదులు చేయుచున్నారు.

మననశీలు రయిన మునులు తమహృదయమునందు దేవతయున్నట్టు నిశ్చయించి ధ్యానించుచున్నారు. మందబుద్ధులగువారు ప్రతిమలయందుమాత్రమే దేవతలున్నట్టుగాఁ దలఁచి పూజచేయుచున్నారు. సర్వమునందు నుండునట్టుగా తెలియువారు భగవంతుడు సర్వత్ర పరిపూర్ణుడైయున్నట్టు ఉపాసించుచున్నారు. అనిభావము.

అవ్యక్తుడై సర్వత్ర పరిపూర్ణుడైన బ్రహ్మము అసాధారణ నామములచేత నుపాసనీయుడే కాని ఇతర విధములుగా నుపాసనీయుడుకాడు.

అయితే జగత్సృష్ట్యాదులకు ఆయన వల్లనే క్రింది యధికారులు బ్రహ్మవిష్ణురుద్రేంద్రాదు లుండిరేని వారిని నుల్లంఘించుటచే వారి నిగ్రహము రాదాయని యంటే ఆదేవతలున్నయెడల వారి కాగ్రహము గలుగదు. ఏలనంటే లోకములో రాజుక్రిందీ యధికారులవంటి స్వతంత్రులుగా ఆదేవతలుండజాలరు. పరిచ్ఛిన్న రాజులవలెనే దేవునికి అజ్ఞానములేదు. సర్వాంతర్యామియు సర్వఫలప్రదాతయు భగవంతుడే గనుక నున్ను ఆదేవతలయందు భగవద్విభూతులే యుండును గనుక నున్ను వానికిని ప్రేరకుడు భగవంతుడు కాబట్టి వృక్షము మొదలనుదక మొంచినను శాఖాపత్ర పుష్పఫలములకు తృప్తి కలిగినట్లు సర్వేశ్వరు నుపాసించుటచే వారికిన్ని సంతోషమే గలుగును

అట్లులేక చెట్టు మొదల నుదకము వేయకనే పత్రపుష్పాదుల మీదనుదకము ఉంచితే పుష్పఫలాదులు తృప్తిపొంది వృద్ధికి రానట్టుక్రింది దేవతల నారాధించితే ప్రయోజన ముతడదు.

అయితే దేవతల నారాధించితే ఇష్టఫలములు గల్గుగలేదా యని యంటే జీవాదృష్ట కాలము వచ్చిన యెడల నాదేవతా రూపముగా నాదేవుడే యాయా ఫలముల నిచ్చు చున్నాడు. ఇందుకు గీతలలో ॥ యోయో యాంయాంతనుం భక్త శ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి । తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహం। సతేయాశ్రద్ధయా యుక్త స్తస్యా రాధన మీహతే । లభతేచ తతఃకామాన్ మయైవ విహితాన్ హితాన్ ॥ అనగా దేవతా బుద్ధితో నింద్రాదుల యేరూపములను ఎవరెవరు శ్రద్ధతో పూజించ నిచ్ఛయించు చున్నారో వారలకు ఆశ్రద్ధనే నేను మెండుగా స్థిరపరచుచున్నాను. ఆశ్రద్ధతో వారు తమతమ యుద్దేశ ప్రకారముగా దత్తద్దేవతారూప శరీరములను పూజించు చున్నారు. ఆపూజకులకు నేనే తత్తద్దేవతా రూపముగా ఫలములను ఇచ్చుచున్నాను అనియున్నది అట్లులేక ఇంద్రాదులకే యట్టిశక్తియున్నట్లు ఇంద్రుడు చేతికి అధిదేవత అయ్యెనే, గావున నతడే రాక్షసులను నిద్రలో వాని వాని చేతితోనే గొంతు కోయవచ్చును.

మరియును అహల్య చేతిలోనే యుండెనే కోడి కూతకూసి భర్తను పిలవంచించవలెను గనుక నట్టి శక్తి దేవతల కున్నట్లు జెప్ప గూడదు.

ఐతే మనుష్యుని నైనా మహిమవంతుని జేయవలెనని దేవునికి దోచితే వాని శాపానుగ్రహవాక్యములను గాని వానిమంత్రము లను గాని తంత్రములను గాని వాని జ్యోత్స్యము వెుదలైన, వానివి గాని

కొంతమట్టుకు సాధకములుగా జేయుచున్నాడు. అట్లుగాక శాగ మంత్రతంత్ర స్వప్నసాముద్రిక శకున జ్యోతిషాదుల వల్లనే యాయా ఫలములుగలుగునట్టు లైతే కొన్నికొన్ని చోట్లనాయాఫలము లేల గలుగవు ఇందుకు కాండవవనరామ పట్టాభిషేకములకు బృహస్పతి వసిష్ఠులేపేరచిన లగ్నములు వ్యర్థములగుటయే దృష్టాంతము.

మరియు భారత భాగవత రామాయణాదులలో మహారాజులు యుద్ధములు చేసినప్పుడు ఆయారాజుల జాతకరీత్యామారక దశ వచ్చినదని చెప్పెడు జ్యోతిష్కులు లేకపోయిరా ? మఱియు నపుడు వచ్చిన సేనకు వారివారి జన్మలగ్నములు లగ్నాంశములువేఱువేఱుగా నుండునే అందఱికి నేకకాలములో మారకము లెట్లు సంభవించును కాబట్టి సర్వమునకు కారణమై సర్వవ్యాపకుడై సర్వశక్తిగల భగవంతుడు దిత్తజ్జీవాదృష్టానుసారముగా గల్గజేయు ఫలములే గాని, ఇతరులకు దెలియుటకు సాధ్యము లైనవి గావు ఇందు వల్ల నథర్వశిఖోపనిషత్తులో, "కారణంతుధ్యేయః" అని చెప్పబడియున్నది అనగా కారణమైన జగన్నాథుడే ధ్యానముచేయదగినవాడు అనియున్నది అనగా ఇతరులుగా రనుట.మహమ్మదీయుల ఖురానులో దేవునికి దప్పనితరులకు దండమము బెట్టగూడదని చెప్పబడియున్నది.

ఐతే యెక్కడెక్కడ భగవద్విభూతి యున్నదో ఆవిభూతికివందనము చేయవచ్చును. ఇందుకు. గీతలలో విభూతివిస్తరయోగాధ్యాయమున ॥ శ్లో ॥ యద్యద్విభూతిమ త్సత్వం శ్రీమదూర్జితమేవవా। తత్తదేవావ గచ్ఛత్వం మమ తేజోంశ సంభవం ॥ అనగా నేయేభూతములు శక్తిమంతములుగా నున్నవో కాంతిమంతములుగానున్నవో మంచిని గలుగజేయుచున్నవో అవి యావత్తు నాయొక్క తేజోంశమువలన గలిగిన విభూతులని తెలిసికొనుము. అనియున్నది

తేజోంశము లనగా భగవచ్ఛక్తియొక్క యంశములు. వాట్లకు వందనములు చేయ వచ్చును ఇంతేగాక మర్యాదార్థము పరస్పరము చేయబడు వందనాదులు గూడా అంతర్యామికే చేయవలెను గాని మనుష్యుని నుద్దేశించి చేయ గూడదు ఇందుకు శ్రీభాగవతము నందు సాంబశివులవారు దాక్షాయణికి జెప్పు చోట ॥ ప్రత్యుద్గమ ప్రశ్రయణాభి వాదనం విధీయతేసాధు మిథ స్సుమధ్యమే । ప్రాజ్ఞైః పరస్మై పురుషాయ చేతసా గుహాశయా యైవ నదేహ మానినే ॥ అనగా వందనాదిక్రియలు గుహాశయుడైన పరమాత్మకే చేయవలసినదిగాని దేహాభిమానియైన జీవునికి గాదు అనిచెప్పియుండుట వలన నంతర్యామికే వందనాదులు చేయవలసినది.

అయితే దైవాదృష్టమును దెలిసి కొన జాలక కాకతాళీయ న్యాయముగా వెంబడే జరుగు ఫలములు ఒకకార్యము చేసితే వెంబడేకల్గు ఫలముల బట్టి ఇది అచ్చివచ్చిన దనియు అచ్చిరాలేదనియు నివి నవగ్రహముల వలన, నివిస్వప్నముల వలన, నివి లగ్నముల వలన, నివి శకునముల వలన, నివి గాలముల వలన, నివితోడుబోతువలన, నిట్టి వానివలన నాయాకార్యములు జరిగినవని చెప్పుచున్నారు.

బుద్ధిమంతులు వారలవారల యదృష్టానుసారముగ దేవుడు జరిపించుచున్నాడని చెప్పుచున్నారు.

అయితే వీడి యదృష్టానుసారముగ జరిపించ బోవు వాట్లకు కొన్నింటికి ముందుగ దేవుడు వీట్లవల్ల సూచింపజేయు గుర్తులుగాన నుండవచ్చును.

౧౩, శ్లో॥ నోటా నే యన్నదానికి.

—(*) అనిశ్చిత జీవస్వరూపము. (*)—

నేనను పదార్థము అని తత్వములలో నంతర్గతమైన మనస్సు ప్రాణమా అంతఃకరణమా అంతఃకరణమందలి ప్రతిబింబమా లేక అంతఃకరణావచ్ఛిన్న బ్రహ్మమా యిందులో గొన్ని చేరిన సమష్టియా, యీసంగతి నేనెరుగను అనిభావము.

గీ, శ్లో॥ స్యాద్వాదేవ యనుతానికి.

—(*) పరిపూర్ణ మనోనిశ్చయము. (*)—

నాస్వరూపము ఎట్లయిన గానిమ్ము దృఢమైన ప్రమాణ బుద్ధి చేత గర్తవైన నిన్ను దెలుసుకొంటిని ఐహిక సుఖము కొరకుగాని యాముష్మిక సుఖము శాస్త్రములలో నున్నదనిచెప్పేదాని కొరకు గాని బుద్ధిమంతులైనవారు నిన్నే భజింప వలసినది కావున భక్తిపరుడనై నిన్ను శ్రేష్ఠమైన జగన్నాథాది నామస్తోత్రము చేత భజింతు చున్నాను.



## —(※) సర్వేశ్వర స్తోత్రమునకు అర్థము. (※)-

| | |
|---|---|
| ౧, సర్వేశ్వరః | సర్వమును నియమించు వాడు. |
| ౨, సర్వసాక్షీ | సర్వమును ప్రత్యక్షముగా జూచువాడు. |
| ౩, సర్వజ్ఞః | సర్వము నెరింగెడివాడు. |
| ౪, సర్వతోముఖః | అంతట ముఖములు గలవాడు అనగా సర్వ దర్శన సమర్థుడనుట. |
| ౫, సర్వాంతరః | సర్వభూతములలోనుండువాడు అనగా కఠిన మైనశిలాదులలోపలను వాట్లచైతన్యమువలెనే యుండు వాడనుట. |
| ౬, సర్వజయీ | సర్వమును జయించువాడు అనగా నన్నిటిని మీరిన వాడనుట. |
| ౭, సర్వాధారః | అన్నిటికి ఆధార భూతుడు. |
| ౮, సర్వదృక్. | సర్వమునకు దృక్కు- ఈదృక్ శబ్దమునకుదృగ్దృశ్యవివేకములోని యర్థము చూడుడు. |
| ౯, సర్వశక్తిస్వరూపః | సర్వశక్తులు స్వరూపముగా గలవాడు. |
| ౧౦, సర్వానంద స్వరూపకః | సర్వానందములు స్వరూపముగా గలవాడు. |
| ౧౧, సర్వేంద్రియ ప్రేరకః | సర్వేంద్రియములకు బహిప్రకృతి ద్వారముగ బ్రేరకుడు. |

| | |
|---|---|
| ౧౨, సర్వయోగ వినిశ్చితః | కర్మభక్తి జ్ఞాన యోగాదులచేఁ నిశ్చయింపబడిన వాఁడు. |
| ౧౩, సర్వేంద్రియ గుణాభాసః | సర్వేంద్రియ గుణములచే బ్రకాశించు వాఁడు. |
| ౧౪, సర్వేంద్రియ వివర్జితః | శ్రోత్రాదీంద్రియ గోళములు లేని వాఁడు. |
| ౧౫, సర్వాసునిలయః. | అన్ని ప్రాణములు స్థానముగా గలవాఁడు, అనగా ప్రాణుల నధిష్ఠించి ప్రాణుల జేష్టింపజేయు వాఁడు. |
| ౧౬, సర్వభర్తా. | సమస్తమును భరించు వాఁడు. |
| ౧౭, సర్వాఘనాశనః | పాపము లన్నిటిని బోగొట్టువాఁడు |
| ౧౮, సర్వవ్యాపీ. | సర్వమును వ్యాపించిన వాఁడు. |
| ౧౯, సర్వదీనశరణ్యః. | సర్వవిధ దీనుల రక్షించు వాఁడు. |
| ౨౦, సర్వసమ్మతః. | ఆస్తికులైన సర్వ మతస్థులచే నొప్పబడిన వాఁడు. |
| ౨౧, సర్వభోక్తా. | సర్వ విషయముల ననుభవించువాఁడు అనగా సర్వమును జూచి సంతోషించు వాఁడనుట. |
| ౨౨, సర్వసమః. | సర్వత్ర సమానుఁడై యుండు వాఁడు, అనగా వైషమ్యాదులు లేనివాఁడు. |
| ౨౩, సర్వకర్మ ఫలప్రదః. | సమస్త కర్మముల యొక్క ఫలముల నిచ్చువాఁడు. |
| ౨౪, సర్వయజ్ఞాధిపః. | సర్వయజ్ఞములకు నధిపతి యనగా నన్నియజ్ఞములచేత నుపాసింపదగిన దైవమనుట యజ ధాతువునకు దేవపూజాది సర్వ యజ్ఞములని యర్థము. |

| | |
|---|---|
| ౨౫, సర్వకారణ కారణం. | జగదుత్పత్తి స్థిత్యాదులకు నేవేవి కారణము లని తెలియబడుచున్నో వాని నిమిత్తించు పరము కారణ మనుట. ఇందుకు విష్ణుపురాణము ౧ అం। ౯ అ। ౪౯ శ్లో॥ కారణం కారణస్యాపి తస్య కారణ కారణం। తత్కారణానాం హేతుం తం ప్రణతోస్మి మహేశ్వరం॥ అని యున్నది. |
| ౨౬, సర్వదేవాధిపః. | సమస్తదేవతలకు నధిపతి. |
| ౨౭, సర్వప్రేరకః. | సమస్త జీవులను దత్త దదృష్టాను సారముగా వారల స్వేచ్ఛానిచ్ఛా పూర్వకముగా సదసత్కార్యములయందు ప్రేరేపించువాడు. |
| ౨౮, సర్వకార్యకృత్. | అన్ని కార్యములను జేయు వాడు అనగా ప్రపంచ రూప సర్వకార్యములను ఉపకరిణాపేక్ష లేకుండా తన మాయాశక్తిచేతనే చేయువాడనుట. |
| ౨౯, సర్వభూతాధివాసః | సర్వభూతములకాశ్రయుడు. |
| ౩౦, సర్వలక్షణలక్షితః | ఈశ్వరత్వసౌభాగ్యములైన సర్వజ్ఞత్వాది లక్షణములతో గూడు కొన్నవాడు. |
| ౩౧, సర్వతీర్థాత్మకః | పావనములైన సమస్త తీర్థములకు ఆత్మభూతుడు అనగా గంగాది తీర్థములకు ఆత్మయై పావనము జేయుచున్నాడనుట. |
| ౩౨, సర్వకామదః | భక్తులుకోరినకోర్కెలనన్నిటినొసంగువాడు. |
| ౩౩, సర్వపాలకః | సమస్త ప్రపంచమునురక్షించువాడు. |

| | |
|---|---|
| ౩౪, సర్వాభిసంధిఫలదః | వారివారి అభిసంధి ననుసరించి సేవకులకుఫలము నొసంగువాడు. |
| ౩౫, సర్వరోగభిషగ్వరః | రోగముల కన్నిటికిని బెద్దవైద్యుడు అనగా స్మరణ మాత్రముచే భక్తుల కాయిక మానసిక రోగములను బోగొట్టువాడు. |
| ౩౬, సర్వతేజస్స్వరూపః | సూర్యుడు మొదలగు తేజస్సులన్నియు దానైనవాడు. అనగా వాట్లను ప్రకాశింప జేయు వాడనుట. |
| ౩౭, సర్వలీలావినోదకృత్ | సమస్తమైన లీలలను వినోదముగా జేయువాడు. |
| ౩౮, సర్వకాలస్వరూపః | భూత భవిష్య ద్వర్తమాన కాలములురూపముగా గలవాడు. |
| ౩౯, సర్వభూతిస్వరూపకః | సర్వ విభూతులును స్వరూపముగా గలవాడు అనగాసర్వవిభూతులుతనశక్తులనుట. |
| ౪౦, సర్వస్వభావరూపశ్చ | సమస్తవస్తువులయందును నియతముగా నుండు స్వభావము దనరూపముగా గలవాడు. |
| ౪౧, సర్వధర్మస్వరూపకః | సమస్త దాన తపస్సత్యాది ధర్మములు దనరూపముగా గలవాడు. |
| ౪౨, సర్వజీవాంతరాత్మా చ | సుఖదుఃఖభోక్తలగు జీవులలోనుండు నంతరాత్మ.. |
| ౪౩, సర్వోపద్రవనాశనః | ఉపద్రవముల నన్నిటిని బోగొట్టువాడు. |

| | |
|---|---|
| ౪౪, సర్వాదిః | సర్వముల యుత్పత్తికంటె పూర్వముననున్న వాడు. |
| ౪౫, సర్వవిత్ | సర్వవిషయముల నెఱింగినవాడు. |
| ౪౬, సర్వదర్శీ | సర్వమ్ము నేక కాలమందు జూచువాడు. |
| ౪౭, సర్వసహః | సర్వమున్ను సహించువాడు అనగాదత్కాలి ముంచే ఫలము నివ్వడని గాని భక్తులదోషము ల సహించువాడని గాని యర్థము. |
| ౪౮, సర్వాత్మా | సర్వమునకు నాత్మ. |
| ౪౯, సర్వతశ్చక్షుః | అంతట దృష్టిగలవాడు. |
| ౫౦, సర్వప్రహరణాయుధః | ఇతరాయుధముల నన్నిటిని ప్రహరించు నాయుధములు గలవాడు అనగా వాట్లకు ప్రతిక్రియ చేయువాడనుట. |
| ౫౧, సర్వభూతాత్మ భూతాత్మా | సర్వభూతములకు నాత్మ యైన స్వరూపము గలవాడు. |
| ౫౨, సర్వవాగీశ్వరేశ్వరః | సర్వవిద్వాంసులకును ఈశ్వరుడు అనగా శాస్త్రము స్త్రశాస్త్రరహస్యములం దెలిసినవాడనుట. |
| ౫౩, సర్వవేదస్తుతః | సమస్త మతస్థుల వేదములచేత పొగడబడు వాడు. |
| ౫౪, సర్వః | సర్వము తానైనవాడు అనగా సర్వము దన పరాపర ప్రకృతి స్వరూపమనుట. |
| ౫౫, సర్వశస్త్రభృతాం వరః | శస్త్రములనుధరించువారిలో శ్రేష్ఠుడు. అనగా ఆయుధాదులు లేకనే సర్వమును సాధించు వాడనుట. |

౯౬, సర్వదేవమయః — ఎవరెవరు దమ తమ మతానుసారముగా నేయేవిధమైనదేవతలను అత్యుత్కృష్టముగా నుపాసించుచున్నారో .వారివారికి ఆయా దేవతారూపముగా ఫలముల నిచ్చువాడనుట.

౯౭, సర్వగ్రహరూపః — సూర్యాదిగ్రహస్వరూపుడైనవాడు అనగా. చంద్ర సూర్యాదులవల్లగలిగినట్టుతలచబడే ఫలములను గలుగజేయు వాడనుట.

౯౮, శాశ్వతః. — నాశములేనివాడు.

శ్లో॥ ఏవంలక్షణసంయుక్తః-అనుదానికి.

పై వివరింపబడిన లక్షణములతో గూడుకొన్న వాడై సమస్తైశ్వర్యాదులను భక్తులయందు దయయును గలవాడై జగత్తుకు ఆధార భూతుడై జగత్తుయందు అంతర్యామిగా వసించువాడై జగత్తుకు నాథుడునై యుండువాడు సర్వదేశ సర్వ కాలముల యందు రక్షించుగాక యని భావము.



శ్రీ

శ్రీకృష్ణస్సహాయోస్తు.

## —(*) జగన్నాథ నామ స్తోత్రమున కర్థము. (*)—

| | |
|---|---|
| ౧, జగన్నాథః | జగత్తులకు నాథుడైనవాడు. అనగా నాథృనాథృయాచ్ఞోపతాపైశ్వర్యాశీష్షు అని ధాత్వర్థము గలదు. గావున జగత్తులచేత యాచింపబడు వాడున్ను జగత్తులను గురించి పశ్చాత్తాప పడు వాడును జగత్తులకు నియామకుడైన వాడును జగత్తులను దీవించువాడునని యర్థము. |
| ౨, జగత్కర్తా | జగత్తులకుఁ గర్తయైనవాడు. |
| ౩, జగద్రూపః | జగత్తులే రూపముగాగలవాడు అనగా దేహికి దేహము గుణమైనట్టు జగత్తులు ఆయనకు గుణమైనవట. |
| ౪, జగద్గురుః | తనవిభూతి స్వరూపులైన వారి ద్వారముగా జగత్తులకు హితోపదేశకుడైన వాడు. |
| ౫, భూతకృత్ | పృథివ్యాది భూతములను సృజించువాడు. |
| ౬, భూతభృత్ | భూతములను భరించువాడు. |
| ౭, విష్ణుః | అంతటనున్ను వ్యాపించువాడు. |
| ౮, భూతభవ్యభవత్ప్రభుః | పుట్టిన వానికిని పుట్టగలవానికిని పుట్టుచున్నవానికిని ప్రభువైనవాడు. |
| ౯, నిరాకారః | ఆకారములేనివాడు. |
| ౧౦, నిర్వికారః | జరామరణాది వికారములు లేనివాడు. |

౧౧, నియంతాచ — నియామకుడైనవాడు.

౧౨, నిరాలయః — నివాసస్థానము లేనివాడు అనగా పరిచ్ఛిన్నుడు గాడనుట.

౧౩, అక్షరః — క్షరము లేనివాడు అనగా నశింపనివాడనుట.

౧౪, శిక్షకః — కర్మానుగుణముగా శిక్షించువాడు.

౧౫, సాక్షీ — జీవకృత పుణ్యాపుణ్య కర్మములను లెస్సగా జూచువాడు.

౧౬, ప్రధానపురుషేశ్వరః — ప్రకృతి జీవులకధిపతియైనవాడు.

౧౭, శంభుః — శుభజనకుడైనవాడు.

౧౮, స్వయంభూః — తనంతనే ప్రకాశించువాడు అనగా తనకుమఱియొక కారణము లేదనుట.

౧౯, పూతాత్మా — పవిత్రమైన యాత్మ గలవాడు అనగా జన్మకర్మదోషాద్యసంస్పృష్టుడనుట.

౨౦, భూతాదిః — భూతముల కాదియైనవాడు అనగా మూలకారణమనుట.

౨౧, శుచిః — పరిశుద్ధుడైనవాడు అనగా అన్నిటియందు వ్యాపించి యుండియును వాట్ల గంధాది సంబంధము లేనివాడనుట.

౨౨, ఈశ్వరః — నిరుపాధికైశ్వర్యము గలవాడు.

౨౩, అగ్రాహ్యః — ఇంద్రియములచే గ్రహింపబడనివాడు అనగా నగోచరుండనుట.

| | |
|---|---|
| ౨౭, శాశ్వతః | సర్వకాలములయందుండువాడు. |
| ౨౫, భర్తా | భరించువాడు అనగా అధిష్ఠానమై జగత్తులను ధరించువాడనుట. |
| ౨౬, నిత్యః. | ఎల్లప్పుడుం గలవాడు అనగాద్రికాలాబాధ్యుం డనుట. |
| ౨౭, పరమమంగళం | నిరతిశయ కళ్యాణమయుండైన వాడని యైనను. శ్లో॥ అశుభాని నిరాచష్టే తనోతి శుభసంతతిం స్మృతిమాత్రేణ యత్పుంసాం బ్రహ్మ తన్మంగళంవిదుః. అనగా ఏబ్రహ్మము తన్ను స్మరించిన మాత్రముచేత జనుల యశుభములను పోగొట్టి వారలకు శుభముల నిచ్చుచున్నదో ఆబ్రహ్మమే మంగళమని పెద్దలు తెలుసుకొని యున్నారు. అనిభావము. అనివిష్ణుపురాణములో నున్నట్లు స్మరణమాత్రముననే ప్రసన్నుడై భక్తుల యశుభంబులం బాపి శుభపరంపర నొసంగునట్టి మంగళశబ్దవాచ్యుండైన బ్రహ్మండై నవాడని యైన నర్థము. |
| ౨౮, ప్రాణదః (చ) | ప్రాణముల నిచ్చువాడనియొండె ప్రాణములను నడుపు వాడనియొండె ప్రాణములను ఖండించు వాడనియొండె నర్థము అనగాభూతములసృష్టిస్థితి లయకర్తయనుట. |
| ౨౯, అప్రమేయః (చ) | ప్రమేయము గానివాడు. |
| ౩౦, పవిత్రః | తాను బవిత్రమై యితర ములను బవిత్రములను జేయువాడు. |

| | |
|---|---|
| ౩౧, శరణం | ప్రణతార్తిహరుఁడైనవాడు. |
| ౩౨, కవిః | క్రాంతదర్శియైన వాడు. అనగా అతీతానాగత సూక్ష్మార్థదర్శియనుట. |
| ౩౩, కృతజ్ఞః | జీవకృత శుభాశుభ కర్మముల నెఱింగినవాడు |
| ౩౪, అనాదినిధనః | ఆద్యంతములు లేనివాడు. |
| ౩౫, సమాత్మా. | సర్వ భూతముల యందు దుల్యమైన యాత్మ గలవాడు అనగా బక్షపాతము లేనివాడనుట. |
| ౩౬, అజః. | పుట్టని వాడు. |
| ౩౭, ప్రజాభవః. | సర్వ ప్రజలు దనవలన బుట్టుట గలవాడు. |
| ౩౮, విశ్వయోనిః. | జగత్కారణ మైన వాడు. |
| ౩౯, అమేయాత్మా. | ఇది యింతదని చెప్పదరము గాని వాడు. |
| ౪౦, లోకాధ్యక్షః. | సర్వలోకములకు ప్రధానోపద్రష్ట యైనవాడు. |
| ౪౧, సమః. | వైషమ్యము లేనివాడు. |
| ౪౨, అచ్యుతః. | చ్యుతి లేనివాడు. |
| ౪౩, ఊర్జితః | ప్రకృష్ట బలశాలి యైనవాడు. |
| ౪౪, అతీంద్రియః | చక్షు రాదీంద్రియ గోచరుండు గానివాడు. |
| ౪౫, శాస్తా | శాసించు వాడు. |
| ౪౬, ధర్మాధ్యక్షః | ధర్మాధికారి యైన వాడు, అనగా ధర్మాధర్మముల కనురూప ఫలముల నిచ్చువాఁడనుట. |
| ౪౭, జనార్దనః | దుష్టజనులను బీడించు వాఁడని గాని శిష్టజనులచేతఁ జతుర్విధపురుషార్థములను యాచింపఁ బడువాఁడని గాని యర్థము. |

౪౮, అమోఘః (చ) నిష్ఫలప్రయత్నము లేనివాడు నిజాశ్రితజనవాంఛితములు మోఘములుగాకుండ ఫలింపజేయువాడని యైనను జెప్పవచ్చును.

౪౯, అమృతః మరణములేనివాడు శాశ్వతుండనుట.

౫౦, నేతా నియామకుడైనవాడు.

౫౧, మహోత్సాహః జగదుత్పత్తి స్థితి రూపమైన మహోద్యోగము గలవాడు.

౫౨, మహాబలః బలవంతుల కన్నను బలవంతుడైనవాడు.

౫౩, మహాబుద్ధిః బుద్ధిమంతుల కన్నను బుద్ధిమంతుడైనవాడు.

౫౪, మహావీర్యః గొప్పపరాక్రమము గలవాడు.

౫౫, మహాశక్తిః మహాసామర్థ్యము గలవాడు.

౫౬, మహాద్యుతిః స్వయంప్రకాశస్వరూపుడు గావుననే తేజస్సుల కన్నిటికిని దేజస్సును గలుగజేయువాడు.

౫౭, అనిర్దేశ్యవపుః అది యిది యని నిర్దేశింప శక్యము గాని స్వరూపము గలవాడు.

౫౮, న్యాయః ప్రమాణానుగ్రాహకముఖ్యతర్కస్వరూపుడైనవాడు

౫౯, మహామాయః మాయికుల కైనను మాయగలుగజేయువాడు.

౬౦, సతాంగతిః సత్పురుషులకు పురుషార్థప్రాప్తిహేతువైనవాడు.

౬౧, సుప్రసాదః మంచి యనుగ్రహము గలవాడు.

౬౨, ప్రసన్నాత్మా కారుణ్యస్వరూపుడైనవాడు.

| | |
|---|---|
| ౬౩, గురుః | గొప్పవాడు. |
| ౬౪, ఆవర్తనః | ప్రపంచచక్రమును ద్రిప్పువాడు. |
| ౬౫, విభుః | సర్వమూర్త ద్రవ్యసంయోగి యైనవాడు. |
| ౬౬, ప్రజాపతిః | ప్రజల కధిపతి యైనవాడు అనగా సర్వేశ్వరుడనుట. |
| ౬౭, అసంఖ్యేయః | లెక్కలేని గుణములు గలవాడు. |
| ౬౮, దమనః | స్వస్వాధికార ప్రమత్తులైన జనులను దమించువాడు అనగా శిక్షించువాడనుట. |
| ౬౯, విశ్వకృత్ | ప్రపంచమును జేయువాడు. |
| ౭౦, ధ్రువః | నిలుకడ గలవాడు. |
| ౭౧, సిద్ధార్థః | సిద్ధించిన యర్థములుగలవాడు అనగా నవాప్తసమస్త కాముఁ డనుట. |
| ౭౨, సిద్ధసంకల్పః | సంకల్ప సిద్ధుడు. |
| ౭౩, సిద్ధిదః. | కర్మ ఫలముల నొసంగు వాడు. |
| ౭౪, వర్ధనః | వృద్ధి పొందించువాడు. |
| ౭౫, అర్చితః | భక్తులచే నారాధింప బడినవాడు. |
| ౭౬, వివిక్తః | జగత్తులకన్న వేరై యుండువాడు. |
| ౭౭, జగతస్సేతుః | జగత్తునకు మేరైనవాడు. |
| ౭౮, సత్యధర్మ పరాక్రమః | అవితథములైన ధర్మ జ్ఞానాది గుణములును విక్రమంబును గలవాడు. |
| ౭౯, ఇష్టః | అందరికిని బ్రియుండైన వాడు. |
| ౮౦, అప్రమత్తః | సృష్ట్యాది కార్యములయందు బ్రమాదము లేనివాడు అనగా నన్నిటమబొరపాటులేనివాడనుట |

౮౧, వరదః — భక్తులకు గోరిన వరముల నిచ్చువాడు.
౮౨, ప్రఖ్యాతః — జగత్కార్యము వలన బ్రసిద్ధుడైనవాడు.
౮౩, పావనః — స్మరణ మాత్రముననే పతితుల నైనను బావనులుగా జేయు వాడు.
౮౪, అతులః — అన్నిటను సాటిలేనివాడు.
౮౫, అశోకః — శోకాది షడూర్మి వర్జితుండైన వాడు
౮౬, తారణః — మాయను దరింపజేయువాడు.
౮౭, తుష్టః — నిత్య సంతుష్టుడైన వాడు.
౮౮, కరణం — జగదుత్పత్తి విషయమై ముఖ్యసాధనమైనవాడు
౮౯, కారణం — జగత్తుకు హేతువైనవాడు.
౯౦, సుహృత్ — మిత్రుడైన వాడు అనగా బ్రత్యుపకార నిరపేక్షముగా నుపకరించు వాడనుట
౯౧, మహావిభూతిః — సమస్త విభూతులకు గారణమైన విభూతిగలవాడు.
౯౨, విశ్వేశః — జగదీశ్వరుడైనవాడు
౯౩, సుఖదః — భక్తులకు సౌఖ్యమును గలుగ జేయువాడు.
౯౪, హేతుః — ప్రపంచములకు గారణమైనవాడు.
౯౫, ఉన్నతః — సర్వోత్కృష్టుడైనవాడు.
౯౬, హరిః — భక్తులయొక్క పాపములనుహరించువాడు.
౯౭, అవ్యయబీజం(చి) — చెడనివిత్తు.
౯౮, ధర్మః — ధర్మస్వరూపుడు.
౯౯, వ్యాప్తః — కారణంబగుటవలన గార్యములయందు వ్యాపించి యున్నవాడు.

౧౧౦, పురాతనః — కాలపరిచ్ఛిన్నుడు గాక చిరకాలము నుండియు న్నవాడు.

౧౧౧, ఆదిదేవః — మొట్టమొదటి దేవుడు.

౧౧౨, మహాదేవః — గొప్ప దైవము.

౧౧౩, దేవేశః — దేవతల కెల్లనధిపతి యైనవాడు.

౧౧౪, పరమేశ్వరః — ఉత్కృష్టైశ్వర్యము గలవాడు

౧౧౫, దేవః — సృష్ట్యాదికార్యములచే క్రీడించువాడు దేవాదుల నతిశయించువాడును సర్వభూతములయం దువ్యవహరించువాడును తనంతనే ప్రకాశించు వాడును స్తావకులచే స్తుతింపఁబడువాడును భక్తులచే గోరబడువాడును అంతటను వ్యాపించి యున్నవాడు నని చెప్పవచ్చును.

౧౧౬, అనుకూలః — తాను పరమాత్మ గావున సర్వజీవులకు ప్రియమైనవాడు.

౧౧౭, ప్రచ్ఛన్నః — గూఢముగా నున్నవాడు - అనగా నవాఙ్మనస గోచరుం డనుట.

౧౧౮, విముక్తాత్మా — స్వభావముల చేత బంధరహితు డైనవాడు

౧౧౯, కృతాంతకృత్ — కృతాంత మనగా మృత్యువు దాని నికృంతనము సేయువాడు

౧౨౦, ఆనందీ — ఆనందము గలవాడు

౧౨౧, పరమః — తనకన్న నుత్కృష్టమైన వస్తువు లేనివాడు

౧౨౨, శాంతః — ఓర్పు గలవాడు.

౧౧౩, స్వవశః — పరాధీనుడు గానివాడు స్వీయులైన భక్తులకు వశమైన వాడని యైనను జెప్పవచ్చును

౧౧౪, భగవాన్ — ఐశ్వర్యాదిషడ్గుణ సంపత్తిగలవాడు అనగా ॥ శ్లో॥ ఐశ్వర్యస్యసమగ్రస్య వీర్యస్యయశస శ్శ్రియః । జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరితః ॥ అనిచెప్పబడియున్నది-

౧౧౫, అభూః — జన్మములేనివాడు

౧౧౬, అవిజ్ఞాతః — ప్రత్యక్షముగా దెలియ బడనివాడు-

౧౧౭, జ్ఞానగమ్యః — జ్ఞానముచే బొంద దగినవాడు.

౧౧౮, నిర్వాణం(చ) — సర్వదుఃఖోపశమనలక్షణపరమానందరూపము గలవాడు

౧౧౯, పరాయణం — పునరావృత్తిశంకారహితముగ భక్తులకుచాప్యమ్మయినవాడు

౧౨౦, స్వాభావ్యః — జగత్సృష్టికర్తృత్వాదులు స్వభావముగా గలవాడు.

౧౨౧, సత్యసంకల్పః — అమోఘసంకల్పముగలవాడు.

౧౨౨, జితక్రోధః — క్రోధములేనివాడు అనగా నిర్నిమిత్తక క్రోధములేనివాడు.

౧౨౩, స్థిరః — స్థైర్యముగలవాడు.

౧౨౪, హరః — సంహారకర్తయైనవాడు.

౧౨౫, గుహ్యః — గోప్యమయినవాడు.

౧౨౬, గభీరః — జ్ఞానబలైశ్వర్యాదులచేత గంభీరమయినవాడు.

౧౨౭, గహనః — పరిమితి తెలియశక్యముగాని సామర్థ్యక్రియలు గలవాడు.

౧౨౮, శ్రీకరః — సంపదనిచ్చువాడు

౧౨౯, శాంతిదాయకః — శాంతినిచ్చువాడు.

౧౩౦, అనంతాత్మా — నిరవధికస్వభావముగలవాడు.

౧౩౧, విశుద్ధాత్మా — నిష్కళంకస్వరూపముగలవాడు.

౧౩౨, క్షేమకృత్ — శ్రేయోదాయకుండైనవాడు.

౧౩౩, ఛిన్నసంశయః — హస్తామలకప్రాయముగా సర్వమును బ్రత్యక్షముగా నెఱింగినవాడు గావున నెందును సంశయములేనివాడు.

౧౩౪, లోకత్రయాశ్రయః — ముల్లోకముల కాధారమయినవాడు.

౧౩౫, పూర్ణః — అవాప్తసమస్తకాముడు ఎల్లెడల నిండియున్నవాడనియైనను జెప్పవచ్చును.

౧౩౬, సత్తా — సకలవస్తుగతసత్తాస్వరూపుడైనవాడు

౧౩౭, స్తుత్యః — స్తుతియోగ్యుడయినవాడు.

౧౩౮, స్తవప్రియః — గుణసంకీర్తనప్రీతిగలవాడు.

౧౩౯, స్రష్టా — సృష్టికర్తయైనవాడు.

౧౪౦, వ్యాపీ — తిలలయందు దైలంబువలె జగత్తులయందు వ్యాపించియున్నవాడు.

౧౪౧, త్రిలోకేశః — ఊర్ధ్వాధోమధ్యలోకములకధిపతియైనవాడు

౧౪౨, విశ్వమూర్తిః — ప్రపంచస్వరూపుడయినవాడు చేతనాచేతన

ములకు ఆత్మస్వరూపుడు అనగా పరమాత్మ యనుట.

౧౪౩, అమూర్తి మాన్ — కర్మనిబంధనమయినమూర్తిలేనివాడు.

౧౪౪, భూతావాసః — పృథివ్యాది భూతములకాశ్రయమయినవాడు.

౧౪౫, దృఢః — స్వరూపసామర్థ్యము వలన ప్రచ్యుతి లేని స్వభావము గలవాడు.

౧౪౬, అనంతః — అంతములేనివాడు.

౧౪౭, దుర్లభః — భక్తులుకానివారికి లభింపశక్యముగానివాడు

౧౪౮, భక్తవత్సలః — భక్తులయందు వాత్సల్యముకలవాడు.

౧౪౯, లోకనాథః — జగదీశ్వరుడయినవాడు.

౧౫౦, లోకబంధుః — లోకములకుచుట్టమయినవాడుఅనగాహితమొనరించువాడు.

౧౫౧, అవ్యక్తః — ఇతడిట్టిచందమువాడని తోచబడనివాడు.

౧౫౨, శోకనాశనః — నమ్మినవారిశోకములను నశింపజేయువాడు.

౧౫౩, అదృశ్యః — కనుపడుచున్న ప్రపంచమునందంతట నిండియుండియును గానుపడనివాడు.

౧౫౪, పావనః — పతితభక్తపావనుడు.

౧౫౫, అచింత్యః — జగద్విలక్షణుడు గావున చింతింపశక్యము గానివాడు.

౧౫౬, శ్రోతవ్యః — గుణములచేత వినదగినవాడు.

౧౫౭, భయనాశనః — ఆశ్రయించినవానిభీతిని పోగొట్టువాడు.

౧౫౮, లోకస్వామీ — లోకములను బాలించువాడు

౧౫౯, దమయితా — పాపాత్ములనుదండించువాడు.

౧౬౦, మాన్యః — గౌరవింపదగినవాడు.

౧౬౧, ఘోషితశాసనః — ప్రబలమునయినయాజ్ఞగలవాడు.

౧౬౨, ఉత్తారణః — తరింపజేయువాడు.

౧౬౩, అనాదిః — ఆదిలేనివాడు.

౧౬౪, ఏకః — నిత్యముగా దనకన్న రెండవవస్తువులేనివాడు.

౧౬౫, లోకాధిష్ఠానం — నిరాధారుండయ్యు లోకముల కాధారమైన వాడు.

౧౬౬, అవ్యయః — నాశములేనివాడు.

౧౬౭, అంతర్యామీ — ఇంద్రియరాజైనమనస్సును వాసనానుగుణము గా బ్రవర్తింపజేయువాడు.

౧౬౮, స్వస్తిదః(చ) — భక్తులకు శుభమ్మునిచ్చువాడు.

౧౬౯, సచ్చిదానంద విగ్రహః — సత్యజ్ఞానానందస్వరూపుడయినవాడు.

౧౭౦, అసహాయః — సృష్ట్యాది మహాకార్యములయందైనను సహాయాంతరములేనివాడు.

౧౭౧, దుష్కృతిహా — పాపములనుబోగొట్టువాడు.

౧౭౨, పుణ్యశ్రవణ కీర్తనః — తనగుణములను వినువారికిని గీర్తించువారికిని బుణ్యము గలిగించువాడు.

౧౭౩, పరాత్పరః — సర్వోత్కృష్టుడు.

౧౭౪, పరంబ్రహ్మ — పరబ్రహ్మమయిన

౧౭౫, రక్షణః — రక్షించువాడు.

౧౭౬, కరుణానిధిః — దయానిధి,

౧౭౭, భవరోగ భిషక్ — జన్మమనెడు రోగమునకు వైద్యుడు.

౧౭౮, పాపనాశనః — తన్నేయాశ్రయించి కొలుచు వారి యొక్క సకలపాపములననశింపజేయువాడు.

౧౭౯, ప్రాణజీవనః — ప్రాణములకు జీవికమైనవాడు.

౧౮౦, శరణ్యత్రాణ నిరతః — శరణుపొందిన వారలను రక్షించుటయందా సక్తి గలవాడు.

౧౮౧, స్మృతసర్వాఘ నాశనః — స్మరణమాత్రముతోనే సకలకల్మషముల నశింపజేయువాడు.

౧౮౨, అజితః — జయింపబడనివాడు.

౧౮౩, తత్వవిత్ — యథార్థ వేత్త.

౧౮౪, భర్గః — తన్నప్రకాశముచేత జ్యోతిర్మయమైన వాట్లను ప్రకాశింప జేయువాడు సర్వమును భజించు వాడని యైనను జెప్పవచ్చును.

౧౮౫, భీమః — పాపాత్ములకు భయంకరుడైన వాడు.

౧౮౬, విశ్వంభరః — ప్రపంచము భరించువాడు.

౧౮౭, మృడః — పుణ్యాత్ములను సుఖింప జేయువాడు.

౧౮౮, ఈశః — పరమైశ్వర్యము గలవాడు.

౧౮౯ ధాతా — సంకల్పించిన పనులన్నిటిని యథోచితముగా జేయువాడు

౧౯౦, సత్యసంధః — అబాధిత ప్రతిజ్ఞా మర్యాదలు గలవాడు.

౧౯౧, పురుషోత్తమః — క్షరాక్షరాతీతుడు.

౧౯౨, ఆత్మభూః — ఆత్మశబ్ద వాచ్యములైన జీవ స్వభావాదులకు నునికి పట్టయినవాడు

౧౯౩, మృత్యుంజయః — సర్వమును జయించు మృత్యువునైనను జయించువాడు.

౧౯౪, విరాట్ — ప్రపంచ రూప విరాట్పురుష స్వరూపుడైన వాడు.

౧౯౫, ఉగ్రః — వాయు సూర్య చంద్రాగ్ని మృత్యువులకు భయంకరమైనవాడు అనగా వారితనికి భయపడి స్వకార్యముల యందు యథార్హముగా ప్రవర్తింతురు గనుక నుగ్రశబ్దవాచ్యుండయ్యెననుట-

౧౯౬, మంతవ్యః — జగత్కారణము గావున మననముచేయ దగిన వాడు

౧౯౭, నిస్సమాధికః — తనతో సమానులును దనకన్న నధికులును లేని వాడు

౧౯౮, మహేశ్వరః — ఈశ్వరులకు నీశ్వరుడైనవాడు-

౧౯౯, మహాకర్మా — అనితర సాధ్యమైనజగత్సర్గాది రూపమహాకర్మము గలవాడు

౨౦౦, మహనీయః — కొనియాడ దగినవాడు-

౨౦౧, మహాయశాః — గొప్ప కీర్తి గలవాడు-

౨౦౨, భూతాత్మా — భూతములకు ఆత్మయైనవాడు.

౨౦౩, పరమాత్మా(చ) — ఉత్కృష్టమైన యాత్మ గలవాడు లేనగా ఆత్మలకు ఆత్మయైనవాడు.

౨౦౪, ముక్తానాంపరమాగతిః — ముక్తులకు గతియయినవాడు ప్రాప్యుడనుట.

౨౦౫, వంద్యః — వందనీయుడు

౨౦౬, భక్తప్రియః — భక్తులకు ప్రియమయినవాడు భక్తుల యందు ప్రేమగలవాడును.

౨౦౭, దీనశరణ్యః — గతిలేని వారికి గతియైనవాడు.

౨౦౮, శంకరః — చతుర్విధపురుషార్థములవలనసుఖమును గలుగజేయువాడు.

౨౦౯, శివః. — మంగళస్వరూపుడైనవాడును మంగళప్రదుడైనవాడును.

౨౪, శ్లో॥ ఏవం విధ స్సర్వ జగన్నాథః అనుదానికి.

నాకు పరమగతియైన ఇట్టి సర్వజగన్నాథుడే సర్వదోషములను పోగొట్టి సర్వదేశ సర్వకాలములయందునన్ను రక్షించుగాకయని భావము.

—(*) { జగన్నాథాద్యసాధారణనామములు శ్రీభగవద్గీతాది గ్రంథములనుండి గ్రహింపబడినవనుట. } (*)—

ఈనామము లన్నియు శ్రీభగవద్గీతలు విష్ణుసహస్రనామములు శివసహస్రనామములు కృష్ణాష్టోత్తరశతము, రామాష్టోత్తరశతము శివాష్టోత్తరశతము, మహాభారతము, భాగవతము, విష్ణుపురాణము, బ్రహ్మవైవర్తపురాణము, ఇవి మొదలగు వానిలో జననమరణములు

గల యవతారములనున్ను బరిచ్ఛిన్నరూపములనున్ను దేవునికి నితరములాధారములుగా నున్ను జెప్పు నదియు నివి మొదలగు నితర సాధారణనామముల ద్రోసివేసి దేవుని నిత్యత్వ సర్వశక్తత్వ సర్వవ్యాపకత్వ సర్వకారణత్వ సర్వనియామకత్వాద్యసాధారణ ధర్మములం దెలుపు నట్టి కొన్నికొన్నినామములు ఎత్తి శ్లోకరూపముగా జెప్పిరిప బడినవి ఈనామములలో కదాచిత్తుగా ఈమనస్మృత్యసిద్ధాంతమునను గించిద్విరోధముగా నుండిన నుండవచ్చును.

—(*) నారాయణ నామము హిరణ్యగర్భ వాచకమనుట. (*)—

అయితే వైష్ణవులు ఈవల పుట్టిన వ్యాకరణ సంకేతము చేత నితర దేవతాపరము కాదని ముఖ్యముగా జెప్పు నారాయణ నామము ఇందులో నేల చేర్చలేదని కొందరందురు. ఈనామము మనుస్మృతి విష్ణుపురాణకూర్మపురాణాదులలో చతుర్ముఖుడైనహిరణ్యగర్భ పరముగా జెప్పబడియున్నది. ఈబ్రహ్మహిరణ్మయమైన యండములో నుండు నపుడు ఉదకము లాధారములుగానుండుట వలన ఈపేరువచ్చినట్లు వ్యుత్పత్తి వ్రాయబడి యున్నది. ఇందుకు మనుః ॥ ౧అ॥ ౯ ॥ ౧౦ ॥ శ్లో ॥ తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభం। తస్మిన్ జజ్ఞేస్వయం బ్రహ్మా సర్వలోకపితామహః ॥ ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః । తా యదస్యాయనం పూర్వం తేన నారాయణస్స్మృతః॥ అనియున్నది. లేక విష్ణుపరముగా జెప్పినను బరిచ్ఛిన్నత గలిగి దేవునికి నుదకము ఆధారముగా నుండుటచే ఆయన సర్వాధారమయిన దేవుడెట్లగును. ఈనారాయణునికి ఆయుః పరిమాణమును జెప్పబడియున్నది.

అయితే సన్యాసులు ముఖ్యముగా నుచ్చరించెదరేయని యంటె సన్యాసమును జెప్పెడు నుపనిషత్తులలో సన్యాసులకు హిరణ్య

గర్భాలో క్రేప్తియని చెప్పియుండుటను బట్టి వారు ఈనామము ను ఉచ్చరింప వలసినట్టు లేపడినది. కాబట్టి ఈలాటివి ఇతర్ములు దేవునికి ఆధారములుగా జెప్పియుందు నామములు ఏవియు చేరఁ లేదు ఎందువల్లనంటే ఇతరములు ఆయనకు ఆధారములయితే, దేవు డెట్లగును.

కొందఱు యీనారాయణనామము కారణవాచియని యర్థ ము చెప్పెదరు. మనుధర్మం బావశ్యక మని వేదమునందు జెప్పం బడినది, ఇందువలన మనువు జెప్పిన యర్థమునకు వేఱుగా జెప్పుట ప్రమాణముకాదు, ఇందుకు॥ శ్లో॥ 'వేదార్థోపనిబద్ధత్వాత్ ప్రా ధాన్యంతు మనోస్మృతేః । మన్వర్థ విపరీతాతు యాస్మృతిస్సా నశస్యతే॥ అని బృహస్పతిస్మృతివచనము ॥ అనగా వేదార్థమును అనుసరించి చెప్పబడినందున మనుస్మృతి ప్రధానమయినది, కావున దానికి విరుద్ధమైన స్మృతి ప్రశస్తము కాదు. అనిభావము.

మనుస్మృతి, ౨ అ, ౭ శ్లో॥ యః కశ్చిత్కస్యచిద్ధర్మో మనునా పరికీర్తితః । స సర్వోభిహితో వేదే సర్వజ్ఞానమయోహిసః ॥, అని యున్నది. అనగా, యేవిషయమై యేధర్మము మనువు చెప్పెనో అదియంతయు వేదోక్తమే-ఆమనువు సర్వజ్ఞుడు-అని భావము.

—(*) చరమశ్లోకభావము. —(*)—

శ్లో॥ జగన్నాథహృషీకేశయ్యనువానికి.

జగన్నాథ జగత్తునకు నాథుఁడైనవాడా అనగా నాథృ నాధృ యాచ్ఞోపతాపైశ్వర్యాశీష్షు అని ధాత్వర్థము. దీని అర్థము ముందు వ్రాయ బడి యున్నది. హృషీకేశ అనగా హృషీకము లనగా నింద్రియములు వానికి ప్రేరకుండనుట విషయాదులందు నా యింద్రియ

ములను ప్రేరేపించుచున్నావు గనుక సద్విషయములలో స్థాయింద్రియ ములనే ప్రేరేపింపుమనుట. ఇంద్రియములకు మనస్సు ప్రేరకము గాదా యనియందురు॥ శ్లో॥ మన షష్ఠానీం ద్రియాణి, యని జ్ఞానేంద్రియము లలోమనస్సు ఆరవ ఇంద్రియమన్ని గీతలలో జెప్పబడియున్నది. గావున మనస్సు ఇంద్రియములకు సాక్షా త్ప్రేరకము గాదు సర్వకారణ కారణ అనగా జగదుత్పత్తి స్థిత్యాదులకు గారణములైన వాటికన్నిటికిని గారణ స్వరూపుడా యనుట. శ్రీకృష్ణాయ నమస్తుభ్యం భుక్తి ముక్తి ప్రదాయినే, కృష్ణ యను పదమునకు॥ శ్లో॥ కృషిర్భూవాచక శ్శబ్దో, ణశ్చ నిర్వృతి వాచకః ।, తయో రైక్యం పరబ్రహ్మ కృష్ణఇ త్యభిధీయతే॥ అనగా కృష్-ణః అను నీరెండున్ను చేరి కృష్ణః అని యగుచున్నది ఇందులో మొదటి భాగమైన కృష్ అనేది భూమిని జెప్పుచున్నది రెండవ భాగమయిన ణః అనేది నిర్వాణ సుఖమును జెప్పుచున్నది. ఈరెంటికి ఐక్య మనగా భూసంబంధ సుఖమును మోక్ష సంబంధ సుఖమును గలుగజేయు పరబ్రహ్మముకృష్ణః అని చెప్పబడు చున్నది అని యున్నది గనుక భుక్తి ముక్తుల నిచ్చు వాడని చెప్ప బడుచున్నది ఇందువలన శ్రీకృష్ణ నామ స్మరణమే సర్వ పాపప్రాయ శ్చిత్తమని చెప్పబడి యున్నది ప్రాయశ్చిత్తములలో భగవన్నామస్మర ణముముఖ్యమనుట ఎట్లనగా విష్ణుపురాణము ద్వితీయాంశము షష్ఠాధ్యా యములో ॥ శ్లో॥ ప్రాయశ్చిత్తా న్యశేషాణి తపఃకర్మాత్మకానివై। యాని తేషా మశేషాణాం కృష్ణానుస్మరణం పరం ॥ అనగా కాయ క్లేశాత్మక తపోరూప ప్రాయశ్చిత్తములలోను యాగ దానాది క్రియా రూప ప్రాయశ్చిత్తములలోను శ్రీకృష్ణ నామస్మరణమే శ్రేష్ఠమైన ప్రాయశ్చిత్తమని యున్నది. గావున నీగ్రంథములోనుండు లోపములం బోగొట్టి రక్షింపుమనుట.

## —(*)—{ ప్రాయశ్చిత్త ములలో కృచ్ఛ్ర చాంద్రాయణాద్యుల కంటెభగవ న్నామస్మరణము ముఖ్యమనుట. }—(*)—

అయితే సమస్త ప్రాయశ్చిత్తములలో కృష్ణాను స్మరణము కంటె నుత్కృష్టమైనది లేదని చెప్పుచున్నారే సమస్తస్మృతులలో నున్ను కృచ్ఛ్రచాంద్రాయణా ద్యాచరణమున్ను ప్రతి . నిధులయిన గోతిలాది దానములున్ను గొన్నింటికి ప్రాణాయామములున్ను ప్రాయశ్చిత్తములుగా విధించియుండు నప్పుడు భగవన్నామస్మరణ ప్రాయశ్చిత్తమని యెట్లు చెప్పనగునంటే పాపమునకు ఫలము దుఃఖమే కాబట్టి కృచ్ఛ్రచాంద్రాయణాది దేహ కష్టములున్ను గోతిలాదిదాన రూపక అర్థవ్యయములున్ను మనుజులకు దుఃఖ జనకములే యగునని లోకాంతరమందును జన్మాంతర మందును పాప ఫలరూపకము లయిన దుఃఖముల ననుభవించు చున్నారు గావున దద్దుఃఖంబులకు నిప్పుడె చేయబడు దేహకష్టము వలనను అర్థవ్యయమువలనను గలిగెడు దుఃఖము ప్రతినిధిగా నగుననియు మరియు దానాదులితరులకు సుఖహేతువు లగు ననియు ప్రాణాయామాదులు వీనికినారోగ్యహేతువు లగుననియు నెంచి కృచ్ఛ్రచాంద్రాయణా ద్యాచరణమున్ను గోతిలాది దానములున్ను ప్రాయశ్చిత్తములుగా శాస్త్రములలో చెప్పియున్నారు సరే.

అయితే అట్లు గాక దేహ కష్టమున్ను అర్థవ్యయమున్ను భగవద్విషయములుగా నుపయోగించినే యెడల భగవంతునికి దయవచ్చి యాపాపములను మన్నించుటే గాక విశేషముగా శ్రేయస్సును గటిగించును.

## —(*) { భగవన్నామ స్మరణము ముఖ్యప్రాయశ్చిత్తమన్నందుకు ప్రమాణము } (*)—

భగవన్నామ స్మరణమే ముఖ్యప్రాయశ్చిత్తమన్నందుకుస్మృతిప్రమాణము. భగవన్నామస్మరణ గూడా సర్వపాప ప్రాయశ్చిత్తమనిస్మృతులలో నెక్కడ విధించియున్నదంటె ఇందుకు యోగయాజ్ఞవల్క్యస్మృతిలో ॥ శ్లో ॥ నతావ త్పాప మీయేత యన్నామ్నా నహృతం హరేః । అతిరేక భయా దాహుః ప్రాయశ్చిత్తాంతరం బుధాః ॥ అని యున్నది అనగా నెవరైన గాని భగవన్నామ స్మరణవలన పోజాలని పాపములను చేయజాలడు.

అయితే సులభ ప్రాయశ్చిత్తము చెప్పినందున బుద్ధిపూర్వకముగా దోషములు చేయ బోదు రనియు ఈసులభ ప్రాయశ్చిత్తము జ్ఞానము చేసితే గొప్ప పాపములను బోగొట్టునా యని శంకింతు రనియు దలంచి పెద్దలు ఇతర ప్రాయశ్చిత్తములను జెప్పిరనియున్నది వసిష్ఠస్మృతిలో ॥ శ్లో ॥ హిత్వా సకల పాపాని లబ్ధ్వా సుకృత సంచయం । సద్యోతో జాయతే ధీమాన్ మురజిన్నామ కీర్తనాత్ ॥ అనగా భగవన్నామ కీర్తనవలన సమస్తపాపములను పోగొట్టుకొని మరియు సుకృత సంచయములను బొందుచున్నాడనియు నున్నది.

మరియు ॥ శ్లో ॥ నామాపరాధ యుక్తానాంనామాన్యేవహరంత్యఘం । అవిశ్రాంత ప్రయుక్తాని తాన్యేవార్థకరాణిచ ॥ అనియున్నది అనగా నామాపరాధములుగలవారి పాపమునునామములే పోగొట్టుచున్నవి. ఆనామములే అవిచ్ఛిన్నముగాస్మరింపబడి నట్టయితే పురుషార్థంబును గూడ గలిగించును అనిభావము.

ఇందువల్ల పైప్రాయశ్చిత్తములకంటె ఈనామస్మరణ హెచ్చైనది.

—(*) అనుతాప పడుట ప్రాయశ్చిత్తము కాదనుట. (*)—

మఱియును గొందరు అనుతాప పడుటయే ప్రాయశ్చిత్తమని చెప్పుచున్నారు. అది సరిగాదు ఏలనంటే అనుతాపము వల్ల పాదు నికమీద పాపములు చేయక యుండుటనేగాని పూర్వపాపములు ఎట్లు నశించును గనుక దేవుడు శిక్షింపకుండునా.

అయితే దేవుడు పాపములకు అనురూపకమైన శిక్ష చేయకనే తన నామమును స్మరించిన మాత్రముచేతనే పాపములన్నింప జే యునా యని యంటే దేవుడు సర్పాది విషములు చంపునవిగా సృ జించియు పరమ దయాళుడగుటచేత నందుకు పరిహారముగా స్వల్ప మైన యోషధియును బుట్టించెను యిదే దృష్టాంతము.

అయితే కాయక్లేశార్థ వ్యయములు గలుగ జేయు కృఛ్ర చాంద్రాయణ గోతిలాది దానములవంటి కష్టములైనవి కాకపోయి నను అనన్యగతికమైన మానసిక దృఢ విశ్వాసము గలుగుటయరుదు అట్టి దృఢవిశ్వాసముతో భగవంతుని స్మరించుట కంటె లోకములో కష్టమైనదియు ముఖ్యమైనదియు గనుపింపదు.

—(*) పుణ్యపాప స్వరూప నిర్ణయము. (*)—

సమష్టికి ముందు వ్రాసిన హేతువుల వల్ల పుణ్యపాపజనక కార్యము లిట్టివని యేర్పడలేదు. అయితే ఆయా దేశములో నాయా కాలములలో నాయా జాతిలో అప్పటి విద్యమానమునుబట్టి బుద్ధిమం తులు పదుగురు మంచివని యెంచునవి పుణ్యములనియు చెడువని యెంచునవి పాపములనియు పండితులువ్రాసినవేశాస్త్రములని యు క్తికి వచ్చుచున్నది. ఇందుకు ॥ మనుః ॥ శ్లో ॥ జాతిజాన పదాన్ ధర్మాన్ శ్రేణీధర్మాంశ్చ ధర్మవిత్ । సమీక్ష్యకులధర్మాంశ్చ స్వధర్మం ప్రతిపాదయేత్ ॥ అనగా, దత్తజ్జాతి ధర్మముల నున్న

ఆయా దేశములలో వాడుకగా నడుచు ధర్మములనున్ను ఆయా తెగలవారు ఏర్పరచుకొని యుండే శ్రేణిధర్మములనున్ను తన్నే కులములో దేవుడు పుట్టించినాడో ఆయా కులములలో సదాచారముగా వచ్చే ధర్మముల నున్ను చక్కగా తెలుసుకొని ధర్మవేత్తలైన వారి వారి సద్ధర్మములను వారువారు నిర్ణయించుకొని తప్పక జరిపించవలయును, అనిభావము.

కులధర్మవిషయములో మనువు ॥ శ్లో ॥ యేనాస్య పితరో యాతాః యేనయాతాః పితామహాః । తేన యాయాత్సతాంమార్గం తేన గచ్ఛన్నరిష్యతి ॥ అనియున్నది. అనగా, తనతండ్రులు తాతలు ఏమార్గమున నడచిరో, తానును ఆమార్గంబుననే నడువవలయును, ఆమార్గంబుననే నడచినచో సన్మార్గమునుబొందగలడు, అనిభావము.

ఇందుకు గీతలలోతృతీయాధ్యాయములో॥ శ్లో ॥ శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ । స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మోభయావహః ॥ అనియున్నది ఇందుకుభావము.

తనస్వధర్మము గుణములేనిదైనప్పటికిన్ని పరధర్మమును అనుష్ఠించుట కంటే తనధర్మమును ఆచరించడమే శ్రేయస్కరమైనది తనధర్మములోనే చచ్చుటమేలు గాని పరధర్మమెంత మేలైనదిగానుండినను అది భయంకరమైనది అనియున్నది, కాబట్టి యెగువజెప్పియుండు ప్రకారము శాస్త్రోక్తములైన వారివారి స్వధర్మములనే వారువారు అనుష్ఠించవలసినది. భాగవతములో, (క) తమతమ ధర్మముదప్పక । సములైనను నమ్మితిరుగ సద్భూలక్షణంబు । ధర్మ

ననుజూచిన విరియేను । గమలాప్తుడు వోడమ విరియ ఘనతమము క్రియాణా॥ అనియున్నది. ఇక్కడ చూచుటనగా తలచుట.

అయితేఆయాశాస్త్రములలో అర్థవాదములుగా నపూర్వ ములను జెప్పియుండు వాట్లవల్ల పుణ్యపాపములు గలుగవు.

అయితే వారువారు ఏర్పఱచుకొని శాస్త్రములలోఁ వ్రాసి న ధర్మాధర్మములు పుణ్యపాపహేతువు లెట్లవునని యంటే వా రువారు అట్టి పుణ్యకర్మము లాచరించి నందున దేవుడు రక్షించు నను విశ్వాసము గలిగి నట్టులగుచున్నది గనుక వారలయొభి సంధికి దేవునికి బ్రీతి గలిగి రక్షించుచున్నాడు అట్టిపాపకర్మము లాచరించి నందున దేవుడు శిక్షించు ననుభయమువానికి లేనట్టు లేపడుచున్న ది గావున నిట్టికార్యములు చేయుటచే దేవుడున్నాడనే యాస్తిక్యము నకు లోపము గలిగినందు వల్ల దేవుని కప్రీతిగల్గి వాడిని శిక్షించు చున్నాడు.

మరియును గొందరు దేవుడు సృజించిన ప్రపంచ భూతము లకు దుఃఖములు చేయుట పాపమనియు సుఖమును జేయుటపుణ్య మనియు జెప్పుచున్నారు. అదిసరియైనదేగాని సాధ్యముకాదు. ఎట్ల నగా॥ మనుః ॥ శ్లో ॥ అహస్తాని సహస్తానా మపదాని చతుష్ప దాం । ఫల్గూని తత్రమహతాం జీవో జీవస్య జీవనం ॥ అనగా జీవములు గల జంతువులలోనే, హస్తములు లేని జీవులు హస్తములు గలజీవులకున్ను, పాదములు లేని జీవులునాలుగు పాదములుగల జీవు లకున్ను, చిన్నవిగా నుండు జీవులుగొప్పజీవులకున్ను, జీవనమగుచు న్నవి అని చెప్పియున్నాడు. జీవులనగా జీవశరీరము లనిభావము.

ఐతే ఇది విధివచనమాయని యంటేకాదు. ఏలనంటేను॥ నమాంసభక్షణే దోషో నమద్యేనచ మైథునే । ప్రవృత్తిరేషా భూ

తానాం నివృత్తిస్తుమహాఫలా ॥ అని చెప్పబడియున్నది. తీనగామాం సభక్షణమందుగాని, మద్యపానమ్మందుగాని, మైథునమందుగాని, దోషములేదు. ఇదిభూతంబులకు ప్రవృత్తి. వీనిని విడుచుట మాత్రము మహాఫలము అనిభావము.

కనుక ఇది విధికాదు జీవులకు జీవనాథజాముగ సృజించిన వాని విషయములో దుఃఖము గలుగ కుండ జేయుట యసాధ్యము కొందరు ఇతర జీవకోట్లకు ఆత్మలేదనియు ప్రాణము మాత్రము కలదనియు దుఃఖముగలుగజేయగూడదనుట వాట్లవిషయముకాదనియు నట్లయినయెడల నెవరికిశక్యముగాదనియుమనుష్యుల విషయమే యనియును గొన్ని యుక్తులచేత జెప్పుచున్నారు పాషాణ వృక్ష కీటక పశువృక్షాదులకు గొన్నికొన్నిటికి జ్ఞానేంద్రియ కర్మేంద్రియాదులలో గొన్నికొన్నిలేనందున వాట్లవాట్లకార్యలోపములను బట్టి యాత్మలేదని తలంచుచున్నారు.

అట్లయితే, జడబాల మూకాంధ బధిరాదులకు నింద్రియలోపము లున్నవి వీరలకు ఆత్మ లేనట్టాకి మఱియు కడమ వాట్లకు. ఆత్మలేనియెడల నవిచేయు కొన్ని కార్యములు,కొన్నిఅనగా భ్రమరము కీటకమును దనవలెనే చేయుట ఈలాటివి విద్యాబుద్ధులు గల మనుష్యుడు చేయగలడా చేయజాలడు. ఇందువలన సృష్టిలో నొకదాని వలన నగుకార్యము మరియొక దానివలన గాకుండు నట్లు చేయుటయే, దేవుని చమత్కారము గావున నితర ప్రాణులకు ఆత్మ లేదని చెప్పుటకు వారి యుక్తిచాలదు.

ఐతే దుఃఖమనుభవించుట మనస్సు వలన్నే గాబట్టి జీవులకు దుఃఖము గలుగ జేయగూడదనుట మానసేంద్రియము లేని వృక్షపాషాణ క్రిమ్యాది జీవుల విషయముగా నుండదు.

ఇరిద్దివలననే ఋషులు కందమూల వ్రీహ్యాదులను భక్షించు చుండిరి. ఇంతేగాక మానసేంద్రియము గల జీవకోట్ల విషయమంద్రైనను హింసజేయు నదిగా నుంచు వాట్లను హింసించితే పాపము లేదని తోచుచున్నది.

ఇందుకు శత్రుసపర్ణ శార్దూలాదుల హింసింప వచ్చు ననీ, శాస్త్రములలోనుందులే దృష్టాంతము, ఇట్లనే ధనకనర్థము వచ్చునప్పుడు కొన్ని విషయములలో ననృతమాడుట సత్యమనిన్ని చెప్పియున్నారు.

ఇందువల్ల, శరీరమాద్యం ఖలు ధర్మసాధనం, అన్న వచనమునుబట్టి ఇవి ధర్మములేయగుచున్నవి మరియు నేలాటివి గాక తక్కినవి యితరులకు జేయు సుఖదుఃఖములే పుణ్యపాప హేతువులగును. అనియంటే అట్లయినను మనుజునికి సుఖము జేయుటయే గనుక మద్యమాంసమైథునాది దానములును పుణ్యములగునా? ఇన్నిటికి నొకనికి దుఃఖము గలుగనిది మరియొకనికి సుఖముగలుగదు. ఎట్లనగా సేవకుడు కష్టము జేయక పోతే స్వామికి సుఖమెట్లు గలుగును. కష్టమంతయును దుఃఖమేను ఇందుకు వేతనము పరిహారమనిన్ని యెడల పరస్త్రీ గమన విషయములోను దానికొనిచ్చు ధనమే పరిహారము కావలసి వచ్చును ఇట్లనే మద్యమాంసాదులు బ్రాహ్మణులకు క్రయముచేత దోషపరిహారము కావలసి వచ్చును అయితే, తేనె శ్రాద్ధాదులలో నుంచుమని యున్నదే, ఆ భక్ష్యములైన యనేక మధుమక్షికలను జంపితేగాని తేనె దొరకదు. అతిక్రయముచేతనే శుద్ధము కావలెను అయితే కలిలో మాంసనిషేధము విప్రులకు జెప్పబడియున్నదిగాని పూర్వమువీట్లకన్నిటికి క్రయముచేత శుద్ధియనే చెప్పబడియున్నది. ఇది యుక్తికిన్యసరిగానున్నది. వాని వాని జీవనార్థము హింసించి విక్రయించు వానికి దోష

మైనప్పటికిని క్రయమిచ్చువానికి దోషముండదుగాని తాను హింసించి మాంసము దినగూడదు. అందులోను ఇట్టి ధర్మసూక్ష్మములు గలవు ఎట్లైనను సమష్టికి భగవత్ప్రీతిని బట్టియే పుణ్యంబును భగవదప్రీతిని బట్టియే పాపంబును నేర్పడుచున్నది గావున భగవన్నామ స్మరణవలన ఆయన దయగలిగి పాపములను మన్నించుచున్నాడు. అట్లని బుద్ధిపూర్వకముగా పాపములు చేసితే గాపత్య మవును గాబట్టి మన్నింపకూడదుటయే గాక యతిశయముగా భగవంతుడికి కోపము వచ్చి అధికముగా శిక్షించును. ఇందువల్ల యుక్తిచేతనున్ను శాస్త్రముచేతనున్ను భగవన్నామ కీర్తన సర్వపాప ప్రాయశ్చిత్తమగును ప్రాయశ్చిత్తమునకు ముఖ్యముగా కృష్ణనామకీర్తనే యేల చెప్పినాడంటే పై వివరించిన కృష్ణ నామ వ్యుత్పత్తి శ్లోకార్థమువలన భుక్తి ముక్త్యర్థముగ కీర్తించే పరబ్రహ్మ విషయక నామ మయినందున పాపరూప ప్రతిబంధకమున్న యెడల భుక్తిముక్తుల నిచ్చుటకు వల్ల యుండదు గాబట్టి పాప ప్రాయశ్చిత్తము ఈనామమునకు ముఖ్యమైనముందు పసిగానున్నది.

## —(*) యుక్తిశాస్త్రము యొక్కన్ను ఉపదేశశాస్త్రము యొక్కయు వివరణము. (*)—

౯. లోకములో శాస్త్రములు రెండువిధములు.

౧ యుక్తిశాస్త్రము అనగా యుక్తిసిద్ధముగా మనస్సాక్షికి వచ్చునది. ఇది ప్రమాణమైనది.

౨ ఉపదేశశాస్త్రము అనగా చెప్పువారికిని వినువారికిని తెలియనిది.

అయితే నావ కల్పాదులు అష్ట పురుషాది విద్యోపాస్యములు చిత్తైకాగ్ర్య జన్యానందములు అనుభవ వేద్యములు గాన యుక్తికి

కావనిచెప్పెదరు. ఈలాటి సంగతులలోనే గురుకీలకము తెలియవ లెనని చెప్పెదరు గురువులు ఇంద్రియ సన్నికర్షణములవల్ల నాద బిందు కళలు కనుపించే ముద్రాది లక్ష్యములు చిత్తైకాగ్రతవల్ల ఆనందాదులు గలిగే సమాధులు చూపినవి. బ్రహ్మము లని భ్రమింప జేసి ద్రవ్యమును సంపాదించుకొనుచున్నారు. ఇందుకు ॥గీ॥ మతము వలస్నిగ లిగమాటలు బహుళ పల్కి। ముచ్చు సుద్దులనొగ్గి మోస పుచ్చి। కాసు కాచెనగాడి కష్టుడు గురుడౌనె। విశ్వదాభిరామవినురవేమ॥ అని చెప్పియున్నది. ఇవి దేహస్వభావ సిద్ధము లగుట వలన బ్రహ్మము కావని యుపోద్ఘాత స్తోత్రములో ౧౪ శ్లోక వ్యాఖ్యానమునందు వ్రాయబడి యున్నది ఇందువలన యుక్తిసిద్ధముగా మనస్సాక్షికి వచ్చు నిటువంటి గ్రంథ మేదియు గాదని పక్షపాతము లేని బుద్ధిమంతు లంగీకరింతురు.

—(*) కొందఱి మతస్థుల దురభ్యాస దురాచారములు.(*)—

బుద్ధిలేనివారు పిచ్చిసంగతులయినను అభ్యస్త తత్వమ్ములైన మతములలోని పిచ్చులను నస్యాదుల వలె విడువ జాలక దీన్ని దూషించుదురు. ఇందు వలననే నీతిశాస్త్రములయందు దురభ్యాసములు చేయగూడదనియు నట్లు చేసిన మెడలునవి సంభవింపనప్పుడు వీడి కేమియుం దోచక వాట్లకు లోబడి శ్రమపడ వలసి వచ్చుచున్నదనియు చెప్పియున్నారు. ఇందుకుస్మృతిలో ॥ శ్లో॥ గాడీతాడీచ ఖర్జూరీ పౌస్తికీ విజయా జయాహాషడేతా మదిరాః ప్రోక్తాః ॥ అని చెప్పబడి యున్నది. ఇందుకు భావముగాడీ అనగా గుడముతో జేయ బడిన మద్యాదులన్నియు, తాడీ అనగా తాటిచెట్లు టెంకాయ చెట్లు మొదలయినవి గొలలుకోసి కల్లు కట్టునవియన్నియు, ఖర్జూరీ అనగా ఈతచెట్లు మొదలయినవాట్లకు చెట్లునుగోసి కల్లు కట్టునవి యన్నియు, పౌస్తికీ అనగా గసాల క్కాయ గీచి తీసినదాని బంక అయిన అభిని, విజయా అన

గా బంగి అకు కల్లి మొదలయినవి,జయా అనగా పొగాకుధూమ్రపస్య ముగాను చుట్టగాను హుక్కాగాను సురితి అనగా నోటిలోవేసుకోవడముగాను ఉపయోగించడము,ఇవియన్నియు స్వాదమును గలిగించి మనస్సును ఆకర్షించునవి గనుక వీటికి మదిరా అనిపేరు వచ్చినది యిది గాక యేవయినాసరే అభ్యాసపడితే విడుచుటకష్టము॥శ్లో॥ అనేక దోషదుష్టస్య కాయస్యైకోమహాన్ గుణః। యోయథావర్తయత్యేనంతం తథైవాను వర్తతే॥ అనియున్నది అనగా ననేకదోషంబులతోగూడిన దేహంబునందొక్క గొప్పగుణంబుగలదు. అది యెయ్యదిఅనగా ఎవ్వడు దీనినెట్లుమలపునో, ఇది, అతనిని క్లేయనువర్తించును అనీభావము. గనుక మంచి వాట్లవిషయములో శరీరమును మరపవలసినది గాని చెడ్డ వాటియందు మలపగూడదు మఱియును.

—* దురాచారములు గల మతములు. *—

దురాచారములు శాస్త్రీయములనియు నశాస్త్రీయములనియు ౨, విధములు.

౧, నిర్బాధకభూతముల హింసాదుల్లు అనగాయజ్ఞములలో జెప్పబడి యుండు హింసాదులు శాస్త్రములలో జెప్పబడియుండునవి శాస్త్రీయములు.

౨, శాస్త్రములలో జెప్పబడక తన సంతోషము కొఱకు చేయబడునవి, యశాస్త్రీయములు.

ఇట్టి అభ్యస్తదురాచారములైన మతముల స్వరూపము కొంతవ్రాయుచున్నాను ఎట్లనగా ఇందువలన నైహికాముష్మికములు గలుగుచున్నవని కష్టమార్గి సాధించుట అనగా తనయూత్రమును తాను ద్రాగుట ఇంమేకు కాపాలికతంత్రసంగ్రహములోని॥ శ్లో॥ అత్యుల్లలణాతాంతస్థిత

మాంచధారాం విహాయ నిస్సారత యాంత్యధారాం । నిషేవ్యతే కేవలమధ్య ధారా కాపాలికై ర్యోగివరైః కుమార్యాః అనగా కుమారి యనగా మనుష్యునియొక్క-మూత్రము అందులధారలో మొదటి భాగము అతికారైనది కడపటి భాగము నిస్సారమైనది అందుల మధ్యభాగము యోగివరులగు కాపాలికులచే సేవింప బడుచున్నది. అని భావము. కొందఱు వైష్ణవులు చతురక్షరి సాధించుట యనగా నారాయణ యనునాలుగు అక్షరములకు గురువు యొక్క- మలమూత్రవీర్యోచ్ఛిష్టములు అర్థమని వాటిని గల్పి తాగుట. మిథున శేషముసాధించుట యనగా దనభార్యను గురువు నొద్దకు బంపి గురువునకు స్ఖలనమైన రేతస్సును దననాలుకతో నాకుట. అన్న శేషము సాధించుట యనగా గురువునకు మద్య మాంసము లధికముగ నిచ్చి గురువు వమనము చేసుకొంటే దానిని తన చెయ్యి తగలకుండా తన నోటితో దినుట యిదె శునక వత్స న్యాయమని చెప్పెదరు. తొడభిక్ష యిచ్చుట అనగా కొందరు గురువుకోరి తేను కొందరు అతిథి కోరితేను తన భార్యనురతికిబంపుట. విష్ణుప్రీతి యని రవికెల యుత్సవము జరిపించుట అనగా గురువు ఎంగిలి చేసి యిచ్చిన మద్య మాంసములను స్త్రీలు పురుషులు దాగాతిని కయిపెక్కి-న వెనుక స్త్రీల రవికెలు తీసి కలిపి కుప్పగా నుంచి గురువు సంజ్ఞ చేయగా దూరమ్ము నుండి పురుషులు పరుగెత్తుకొని వెళ్లి యెవరికి దొరకిన రవికెను వారెత్తుకొని అందులో తల్లి, తోడబుట్టువు కొమార్తె, రవికె వచ్చినను దానితో గ్రీడించుట. ఇందుకు నేను జెప్పించిన బ్రహ్మానందశతకము కొనన ఆభాసరసిక తారావళి యందుండు పద్యము॥ సీ॥ మద్య మాంసములతో మహిని రామానుజ కూటముల్ చే సిభ క్తులమటంచు। రవికెలోత్సవమున దల్లితోడని లేక క్రీడింతురది విష్ణుప్రీతి యనుచు। దనయాలి గురువు నొద్దకు బంపివాని తేజము పెంద్రుమిథున

శేషంబటంచు। మరి మద్యమాంసంబు గురువు మెసని త్రొక్కి చెలగి। మెక్కుదు రాత్మ శేష మనుచు। చతురతమరి యటంచు జతపడి గురు మల మూత్రవీర్యో చ్ఛిష్టములు గుడుతురు। పెరుమాళ్లనైవేద్య పిశిత మద్యంబులు గురువుముందుగ దినక్రోలి మెంగి। లిచ్చినదినిమదమెక్కి శిష్యు డులేచి గురుపత్ని పై బడి గుద్ద పగుల। ద్రొబ్బ గురుడును మదమెక్కి తోడు తోడ। శిష్య పత్నితో గ్రీడించి సిగ్గులేక। పరగనిట్లు ంగిషడరాని పాట్లు షదుదు। రవనిలో గొంథ రాభాస రసికజనులు॥ అనియున్నది మరియు భైరవమతస్థులు॥ శ్లో॥ మద్యం మాంసంచమత్స్యశ్చ ముద్రా మైథునమేవచ। ఏతే పంచ మకారాస్స్యు ర్మోక్షదాహి యుగేయుగే॥ పీత్వాపీత్వా పునః పీత్వా యావత్పతతిభూతలె। పున రుత్థాయవైపీత్వా పునర్జన్మనవిద్యతె। మాతృ యోనిం పరిత్యజ్య విహరేత్సర్వయోషిషు, అనియు చెప్పుచున్నారు మరియు జచ్చినవారికి స్వర్గము గలుగుచున్నదని వానిచితిలో గాలిన యెముక దెచ్చి పొడిజేసి పాయసములో గల్పి బాపలకు ద్రవ్యమిచ్చి త్రాగించుచున్నారు దీనిపేరు శల్యపాయసము అని చెప్పుచున్నారు.

తనబిడ్డ బ్రతుక వలెనని దృష్టితీసి పెరుల బిడ్డలను రహస్యముగా జంపుచున్నారు. ఇదియె జీవికి జీవిబలి యని చెప్పుచున్నారు.

మరియు వేద మతమువారు సౌత్రామణి యాగములోనుచ్ఛిష్ట భేదము లేకుండ సురాపానము చేయుట పౌండరీక యాగములోయజ్ఞకుండము పైన మంచెగట్టి యందుపైన స్త్రీపురుషులను రమింపజేసి వీర్యమును ఆగుండములో పడునట్లు చేసి అప్పుడు కొన్ని మంత్రములు చెప్పుట.

అశ్వమేధమునందు చంపబడినగుఱ్ఱపు శిశ్నమును యజమానుని

భార్య యజుకస్థకు అధ్వర్యుడుసంధానము చేసి యొక రాత్రియాదీతిగ నుంచుట అప్పుడు యజ్ఞశాలలో స్త్రీలను విత్తలిచేసి ఋత్విక్కులు క్రీడించుట. అగ్నిష్టోమాది యాగములలో యాజమానుని భార్యచేత ఆపె జారుని పేరు అందరిలో జెప్పించుట అశ్వమేధ గోమేధాదుల యందు నాయా మాంసములను భక్షించుట- మరియు భారద్వాజసూత్రములో ఆహితాగ్ని శవ సంస్కారమందు, ఆశవముతో కూడరాజురొక్క గోవును గొంచుకపోయి చితిని ప్రజ్వలింపజేసి, చచ్చినవాని భార్యయెదుట ఆగోవును అనేకులు చేరి దెబ్బలు కొట్టి విశేష శ్రమపరచిచంపవలెను. దానిమాంసము ఆచితిలో హోమముచేసి వెనుక ఆ ఆహితాగ్నిశవమును దానిలో వేయవలెననియున్నది. ఇందుకు అన్ని వేదమంత్రములు వ్రాయబడి యున్నవి.

ఆపస్తంభ గృహ్యసూత్రములో జెప్పబడిన గోవధాహార సమయములు. ఏవనగా,

అతిథివచ్చినప్పుడును, పితృదేవతలనారాధించునప్పుడును, అనగా శ్రాద్ధాదులందును వివాహకాలమందు అల్లుడికి మధుపర్కమిచ్చునప్పుడును, గోవునుజంపి ఆమాంసమును భక్షణకు నివ్వవలెనని చెప్పబడియున్నది.

ఇవియన్నియు నెంత యసహ్యకరములైనవో యెంత యన్యాయకరములైనవో ఎంతహింసాకరములైనవో మీరే యోచించుడు. ఇట్టివె యనాది వాడుకలచేత సద్ధర్మములుగా నెంచి జరిపించు వారు నేనె గ్రంథమునందు వ్రాసినమన స్వాత్మికములైనతత్వముల నెట్లు ఒప్పుకొందురు అయినప్పటికిని బహుకాలము ఉండబోవు నీవిస్తారమైన ప్రపంచ

ములో నిప్పుడేని మెప్పుడేని యొకానొక బుద్ధిమంతుడు గలుగడా ఈ గ్రంథముయొక్క గుణగ్రహణము చేయడా అనునీయాసతో బహుప్రయాసపడి ఈ గ్రంథము వ్రాసినాడను ఇదే రీతిన మాలతీమాధవము లోనుండు॥ శ్లో॥ యేనామ కేచి దిహనః ప్రథయం త్యవజ్ఞాం జానంతి తేకిమపి తాన్ ప్రతినైష యత్నః। ఉత్పత్స్యతే మమతు కోపి సమానధర్మా కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ ॥ అని చెప్పబడియున్నది.






(✻) ఈ అంగుళీయకము నందలి ౪ అక్షరములం దిమిడియున్న దనుట. ఈ గ్రంథ సమష్టి భావము. (✻)

ఈ అంగుళీయకము నందు చేర్పఁబడ్డ యీ నాల్గక్షరము లందే యీ మనస్సాక్ష్య గ్రంథభావము ఇమిడియున్నది ఎట్లనగా.

"దైవం సత్యం"

అను నీ రెండు పదములు.

ఈ రెంటిని వేరువేరు వాక్యములుగ జేసిన మొదల

పరమును గురించి దైవమును,

ఇహమును గురించి సత్యమును

సేవింప వలయు నని యర్థ మగుచున్నది.

దైవ పద ప్రయోగము భగవంతునియందు హరివంశములో "నదైవం కేశవాత్పరం," అనియు, గీతలలో, "దైవంచైవాత్ర పంచమం," అనియు ప్రయోగంబున్నది. దైవశబ్దవ్యుత్పత్తి దివ్ అను ధాతువు మీద కృత్ ప్రత్యయము గలిగి సుబంతమై దేవశబ్ద మేర్పడుచున్నది. దేవ శబ్దముమీద అణ్ ప్రత్యయము గలిగి, దైవశబ్ద మేర్పడుచున్నది. దివ్ ధాతువునకు క్రీడాద్యర్థము గనుక దేవ దైవశబ్దములకు నొకటే అర్థము. ఎగువ జగన్నాథ స్తోత్రములో ౧౦౫ వ స్థానమైన దేవపద వ్యాఖ్యానమంతయు నిందు సర్వము వ్రాయబడియున్నది.

సాయ్యము ఈశ్వరప్రీతి జనకమై పరమునకు సాధనము. ఇందు వలన సత్యము పరమును గురించి వ్యవసాయము చేసినట్లగుచున్నది.

రెండుపదము లొకటిగ జేర్చితే,

దైవం సత్యం అని యగుచున్నది ఇందుకు మూడర్థములు.

౧, దైవం - సత్యం = దైవం సర్వశక్తి గల భగవంతుడు సత్యం వాస్తవముగా గలడు. ఇందుకు మనసాక్ష్యము చేతనాచేతన మిశ్రితమైన ఈచిత్ర విచిత్ర ప్రపంచమునున్నూ నాయా వస్తువులయందు దత్తత్స్వభావములనున్నూ నిర్మించుటకు స్వనియమనమును జగత్తు అతిక్రమింపకుండు నట్లు చేయుటకు సర్వశక్తిగల భగవంతుని నంగీకరింపక విధిలేదు.

౨, దైవం సత్యం = దైవం- దేవుడు సత్యం - సత్య స్వరూపుడు అనగా త్రికాలాబాధ్యుడు ఇందుకు అర్థం, భూత భవిష్య ద్వర్తమాన కాలముల నశింపక నిత్యముగా నుండువాడు అనుట.

3, దైవం సత్యం = దైవం- అదృష్టము సత్యం - వాస్తవముగా గలదు అదృష్ట మనగా లౌకిక కారణము కనుపించనిది ఇందుకు మన సాక్ష్యము. వారి వారి యనుభవము నందు దమకు గలుగుచుండు నిర్హేతుక సుఖ దుఃఖములు లాభ నష్టములు కారణ సామగ్రి యుండియు నొకప్పుడు కార్యము పుట్టకుండుటయు నొకప్పు డప్రయత్నముగా కార్యములు సిద్ధించుటయును జూడగా అదృష్టమును నంగీకరింపక విధి లేదు.

అయితే అదృష్టమను నది జడముగనుక యదృష్టానుసారముగ దేవుడే యాఫలముల నిచ్చుచున్నాడు ఇందువలన స్పష్టముగా దేవుడున్నట్లు తేటపడుచున్నది.

ఇంతేగాక యీనాలుగు అక్షరములే యిందుకు ప్రతిజ్ఞా దృష్టాంతములగుచున్నవి ఎట్లనగా.

ప్రతిజ్ఞ, దైవంసత్యం = ఇందుకు అర్థము.

దేవుడు వాస్తవముగా గలడు ఈప్రతిజ్ఞకు దైవంసత్యం, అనువవియే దృష్టాంతము ఎట్లనగా దైవం అనగా అదృష్టం।సత్యం అనగా వాస్తవముగా గలదు.

అయితే ఇది జడ మగుటచేత వాని వాని యదృష్టానుసారముగా తత్తత్ కార్యములయందు దేవుడు ఫలముల నిచ్చుచున్నాడు ఈయనుభవమును బట్టి దేవు డున్నాడని యేర్పడు చున్నది గాన నిదే దృష్టాంతము ఇందువల్లనినాలు గక్షరములలో చేరిన వాక్యమే ఇందుల ప్రతిజ్ఞా దృష్టాంతము లగుచున్నది.

వీరి యదృష్టాను సారముగ దేవుడు సిద్ధ్యసిద్ధి చూపక ఫలములనిచ్చుట. ఇట్లుస్పష్టముగానుండు దీనికి కొందరుచెప్పేదియేమంటె.

కొన్ని కార్యములు సిద్ధ్యసిద్ధి విషయములలో సూక్ష్మములైన కొన్ని కారణము లుండుట తెలియరానందున నదృష్టానుసారముగా దేవుడు జరిపించు నట్లు ఆస్తికులు పొరపాటుగా దలచెదరని నాస్తికులు ఆక్షేపించు చున్నారు అది సరికాదు యేల నంటే మనకు తెలియని కొన్ని కారణము లున్నవని వారు చెప్పుటకు ఏమి యుక్తి అట్లనుటకంటె అదృష్టాను సారముగా ఫలములు జగత్కర్తవలస నియ్యబడుచున్న వనుటకు నేమి యాక్షేపము.

అయితే జగత్తు కర్త లేక స్వభావముగా కల్గుచున్నదని చెప్పుదురు. అట్లు కాజాలదని ఇందు స్వభావవాద నిరాకరణమందు వివరముగా వ్రాసి యున్నాను కాబట్టి సర్వమునకు జగన్నాథుడే ముఖ్యకారణము.

—(※)జగన్నాథుని ప్రతిపాదించు ముఖ్యశ్లోకము.(※)—

అట్టి జగన్నాథుని ప్రతిపాదించు ముఖ్యమైన॥ శ్లో॥ జగన్నాథో జగత్కర్తా జగత్త్రాతా జగద్విభుః । జగదీశో జగద్భర్తా జగద్వంద్యో జగన్నుతః ॥ దీనికి అర్థము.

| | |
|---|---|
| జగన్నాథో | జగత్తుకు నాథుడైనవాడు. |
| జగత్కర్తా | జగత్తును నిర్మించినవాడు. |
| జగత్త్రాతా | జగత్తును రక్షించువాడు. |
| జగద్విభుః | జగమునంతంతటా వ్యాపించి యుండువాడు. |
| జగదీశో | జగత్తుకు నియామకుడైనవాడు. |
| జగద్భర్తా | జగత్తును భరించియుండువాడు. |
| జగద్వంద్యో | జగత్తుచే నమస్కరింప దగినవాడు. |
| జగన్నుతః | జగత్తుచేత స్తుతింపదగినవాడు. |

అయిన నీప్రేరణచేత నేను వ్రాసిన ఈగ్రంథ మందుండు లోపాలోపములు తండ్రికి పసిబిడ్డని యొక్క అవ్యక్త వాక్యములు ఆనంద జనకము లైనట్టు నీకు ఆనంద జనకము లగునని నమ్మెదను.

—(※) { ఇహమునకు మానసమును పరమునకు నామమును ముఖ్యసాధనమనుట. } (※)—

ధర్మార్థ కామ మోక్షములను దెలుపు సహేతుక నీతి సూత్రములు హితకరత వాక్యములతో జేర్చి యొక నీతిగ్రంథము ను వ్రాసియున్నాడను. అందులో సారమైనది పరలోకమునకు నిహలోకమునకు ముఖ్యమయిన నీతి యీ రెండక్షరము లందు నిమిడి యున్నది యెవ్వియనిన.

నామం.

ఈ రెండు అక్షరములను మాత్రము - అనగా

హల్లులను వ్యత్యాసము చేసితే;

మానం

అనియగుచున్నది.

ఇవి పరమునకు నిహమునకు ముఖ్యములైనవి ఎట్లనగా

పరమునకు ముఖ్యము భగవన్నామము.

ఇహమునకు ముఖ్యము వారివారి మానము.

ఈ రెంటిని గల్పితే.

నామం మానం అని యగుచున్నది.

అనగా పరమును గురించి భగవన్నామము, మానం అనగా మానమె ముఖ్యప్రమాణమని యగుచున్నది. మరియు భగవన్నామమును మానమనగా మానుకొనుట. ఈ రెండు పదములను జేర్చి వ్యత్యస్తము చేసితే,

మానం నామం అని యగుచున్నది.

అనగా నిహములో తన ప్రతిష్ఠను గాపాడుకొనుటయే మానం, నామం అనగా తనమానమును గాపాడుకొనుటయే తన పేరు ప్రతిష్ఠ లోకి రావడము ఇందువల్లనే మనమునకు మానుషమని పేరు మానుషమనగా మనుష్యధర్మము అది లేకపోతే మనుష్యపశువని భావము పరమునకు ఇందువలన అనన్యగతికమైన దృఢవిశ్వాసముతో అందుకు అనుభావమైన భగవన్నామ కీర్తన చేయుటవలన సర్వపాప పరిహారమును గలుగజేసి వీడికేది పరమమయిన శ్రేయస్సో దానిని

భగవంతుడు కలుగఁ జేయుచున్నాడు, ఇహమునకు తనమానమందు దృష్టి గలిగి యసత్యా ద్యక్రమములు చేయకుండి నందున లోకహింస లేక యుండుటయు అందువలన లోకములో గీర్తి ప్రతిష్ఠలు గలుగుటయు నెప్పుడు జగత్తు సంతోషించుచున్నదో అప్పుడు జగత్కర్తయైన పరమాత్మ సంతోషించుటయు గలుగు చున్నది కాబట్టి నీతిశాస్త్రములలో "నామం" అను నీరెండక్షరములు ఇహ పరలోక సుఖకరముఖ్యములైనవి. ఈ గ్రంథములో నుదాహృతాంశములన్నియు గ్రంథ విస్తర భీతిచే ముఖ్యములైన వానిలో నతిసంగ్రహము చేసి వ్రాయ బడినవి. ఇందువలన స్థాలీపులాక న్యాయముగా బుద్ధిమంతులైనవారు ఇందలి భావములను గ్రహించ వలయును విపులముగా వ్రాసిన యెడల నొకొక్క విషయము ఈ గ్రంథమంతయగును గావున సంగ్రహించి వ్రాసితిని.

—(*) {ఎల్లవారికిం దెలియుటకై యిందు గ్రామ్య పదంబులును బ్రయోగింప బడ్డవనుట.} (*)—

మరియు నందరికి దెలియుటకు తేలికయగు వాడుకమాటలు గాను గ్రామ్య ప్రయోగములు గాను వ్రాసినాడను ఎందువల్లనంటే తెలుగు వ్యాకరణము చిన్న గ్రంథ మైనను పూర్వీకులు చదివించడము లేదు. ఏలనంటే, యేభాష యేనియు ఆ దేశములో నుండు వారు విశేషాభ్యాసము చేత నుచ్చారణ సౌకర్యార్థము గొన్ని యక్షరములు లోపించునట్లు కొంచెముగా మాటలాడుట యాచారమైనందున అంతగా ఆవశ్యకము లేదని మాని వేసినారు ఆలాగు చదివినవారే బహుజనులు ఉండుట చేతనున్ను వ్యాకర్ణము చదివిన వారైనను మాటలాడు నప్పుడు గ్రామ్యముగానే ఉచ్చరించుట వలననున్ను వ్యాకరణ, శిక్షితముగా వ్రాసితే కొందరికి తాత్పర్యము భిన్నముగనగు ననియు నెంచి ఈ గ్రంథాభిప్రాయము అందరికి జక్కగా దెలియవలె

దని వాడుకగా నుండు మాటలతో వ్రాసినాడను పిలక్షణశాస్త్ర మేనియు లక్ష్యము చూచి పిమ్మట కొన్ని సంకేతములు ఏర్పరచగా లక్షణము పుట్టుచున్నది ఇందువలన తెనుగుభాష యనాదిగా నుండి నన్నయభట్లు ఈవల లక్షణము చేసినందున పూర్వపు వాడుకప్రకారమే సమస్త జనులు ఉచ్చరించుచు నుండుట వలన గ్రామ్యప్రయోగములే అందరికి తెలియ దగినవి గాన నీలాగు వ్రాసినందుకు అంగీకరింప వలయును.

ఈమనస్సాక్ష్యము అను తత్త్వగ్రంథము, ప్రమాణ మవ్వేటి పక్షములో తమ తమ మనస్సునకు దోచిన దంతయు మనస్సాక్ష్యమై ప్రమాణము కావలసి వచ్చునని కొందఱు చెప్పెదరు ఇది అలాటిది గాదు, అట్లవ్వేడి పక్షములో, దేవుడున్నాడు, లేడు, అను మతములు వారివారి మనస్సుకు దోచి వ్రాసినవేను. మరియు దనసుఖము నిమిత్తముగ నితరులకు దుఃఖ జనకములైనవి కూడ తన మనస్సునకు దోచినవికూడ ప్రమాణములు గావచ్చును. ఈ మనస్సాక్ష్యముఅట్టిది గాదు. ఎట్టిదనగా. ఇందుకు మనుస్మృతియందు॥ శ్లో॥ ప్రత్యక్షం చానుమానంచశాస్త్రంచ వివిధాగమం। త్రయం సువిదితం కార్యం ధర్మశుద్ధి మభీప్సతా ॥ అనియున్నది అనగా, ధర్మశుద్ధిని గోరువాడు ప్రత్యక్షానుమాన ప్రమాణములును, నానావిధ వేదశాస్త్ర ప్రమాణమును, ఈ మూడింటిని జక్కగా దెలిసికొని యనుష్ఠింపవలయునను అనిభావము.

మఱియు, శ్లో॥ పరిత్యజే దర్థ కామౌ యౌస్యాతాం ధర్మవర్జితౌ । ధర్మ మప్యసుఖోదర్కం లోక విక్రుష్ట మేవచ ॥ అని యున్నది అనగా శాస్త్రోక్త ధర్మవిరుద్ధములైన యర్థ కామములను విడువ వలయును. ఉత్తరత్ర దుఃఖమును గల్గించు నదియు లోక

విరుద్ధంబును నగు శాస్త్రోక్త ధర్మంబు లైనను విడువ దగియును అని భావము.

ఇందువలన శాస్త్రోక్తధర్మ విరుద్ధమైన మనస్స్వాతంత్ర్యము పనికిరాదు. తనకు, లోకమునకు సుఖవిరోధమైన శాస్త్రము పనికిరాదు.

ఇంద్రియ గోచరమగు ప్రత్యక్ష ప్రమాణమును, కార్యమును బట్టి కారణమును నిశ్చయించు అనుమానప్రమాణమును, యుక్తియు తదనుగుణ నానా మతశాస్త్ర ప్రమాణములును తనకు లోకమునకు సుఖకరమైన యంశంబును, ఇవి మొదలగు నంశములు తోచెడు మన స్స్వాతంత్ర్యముయొక్క భావము గలది యీ మనస్స్వాతంత్ర్యము అను గ్రంథము.

దీనిని బుద్ధిమంతులు పక్షపాత బుద్ధిలేక యోచించి యంగీకరించుదురని నమ్మి అట్టివారికి వందనములు చేయుచున్నాడను.

ఈ గ్రంథములో నేర్పడిన సారాంశములు. ౬.

౧, దైవము సత్యము.

ప్రపంచ కర్తృత్వము వలనను, అదృష్టానుసార ఫలప్రదాతృత్వము వలనను, దైవము సత్యముగా నున్నాడనియు.

౨, నామ స్మరణము ముఖ్యము.

భగవంతునికి రూపములేనందున అనన్యగతిక దృఢవిశ్వాసముతో జేయు తద్గుణక్రియా ప్రతిపాదక నామస్మరణము శరణమనియు,

౩, ఉపకారము చేయదగినది.

ఉపకారమునకు మించిన భగవత్ప్రీతి లేనందున నుపకారము చేయదగిన దనియు,

౪, తన సద్ధర్మములను విడువగూడదు.

దేవుడు, ఆయా మనుజుని ఆయా కులములో పుట్టించినందున ఆయా మనుజుడు తన సద్ధర్మములను విడువ గూడదనియు,

౫, మానము నాశము.

తనమానమును గాపాడుకొనుటయే, తనపేరు ప్రతిష్ఠకు వచ్చుట యనియు.

౬, భవిష్యత్తు ఆలోచింప వలసినది.

లౌకిక కార్య విషయమై ముందు ఆలోచింప వలసినది. అది అట్లుండగా "నాస్తిచేన్నాస్తినోహాని రస్తిచేన్నాస్తికోహతః" అనగా, ముందు ఆలోచన దేవుడు లేని యెడల నున్నాడను వానికి హానిలేదు, దేవుడున్న యెడల లేడనువాడు ముందు చెడి పోవుచున్నా డనియు.

ఇవియే యీగ్రంథములో సారాంశములు.

"దైవము సత్యము" అనునది ముఖ్య ప్రమాణము. దీని ననుసరించినవి, తక్కిన ౫, అని తెలియ వలెను.

ఈమనస్సాక్ష్య మనుగ్రంథము మొట్ట మొదట నాకు గోచనసారాంశములు వ్రాసి ౧౮౮౬ వ సం॥ మార్చి నెలలో అచ్చు వేయించి ప్రచురపరిచితిని.

ఈవల మఱికొన్ని నాకుదోచిన విశేష విషయములు చే ౧౮౮౬ వసం॥ అక్టోబరు నెలలో రెండవమారును, మఱి కొన్ని విశేషములు చేర్చి ౧౮౮౮ వ సం॥ జులై నెలలో మూడవమారు అచ్చువేయించి ప్రచుర పరచితిని.

ఇందుమీద నేవిధమైన యాక్షేపములు గలిగి స్థిరపడలేదు.

ఇప్పుడు నాల్గవమాటు నాకు దోచినవి చేర్చి, గొప్పపండితులయొక్క యభిప్రాయము పుచ్చుకొనియు, విపులముగా వ్రాసి అచ్చువేయించి ప్రచుర పర్చితిని.

ఇకమీద నేహేతువు చేతనైనను మార్చుటకు వలనుపడదు.

—(*)మనస్సాత్వ్యము.(*)—

అను తత్త్వగ్రంథము.

సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.

